స్ఫూర్తి కృష్ణచిర్దత్తః శీలవృత్తగుణాన్వితః [।] ధనుమ్మర్తు (3) రమ శ్రేష్ఠః శ్రేష్ఠః సర్వకలాసు చమాతాపిత్రపాదాబ్జ[27] భ్రమరోభాస్వ (4) రోన్నప [ః ×] ణ్ణనారాయణాహ్వయ స్సర్వ కత్రుభిః [8] తాంబర॥ తస్మై మాదవదాబాధి (5) [రా] జారా [జేన్ద్ర] [29] పుం గవః] ప్రీతిః ప్రాదాన్మహాగ్రామ మారుంబాకేతి విశ్రుతః ॥ తస్మై × (6) [ణ్ణనారా] యణాయ శైలనాణ్డువిమయే ఆరుంబాక నామ గ్రామం సర్వ[30] కరపరిహారం[31] (7) [తామ్ర] శాసనీ [కృత్యమ] యాదత్త ఇతి ॥ బాదపరాశేద్వేన దత్త దత్త గ్రామస్వీకృత్వా

అయిదవ రేకు — మొదటి ప్రక్క

(1)...×ణ్ణనారాయణ స్స్వయం స్వమాతుర్నాయ మంబా యాః కనీయసీ సహోదరీ సా (2) ...కాంబాక [స్యాః పు] త్రి కృష్ణదేనాఖ్యః తస్మై చన్ద్రేనాఖ్యాయ స్వీకృత మారుంబాక నామ(3) [గ్రా]మం మ[32] ద[కపూర్వం][33] ప్రాదాత్తం గ్రామ(౦)స్వీకృత్వా

27 పదాంభోజ 28 భృతాం 29 రాజేంద్ర 30 గ్రామస్సర్వ 31 పరిహారః 32 గ్రామముదక 33 పూర్వం

చన్ద్రేనాఖ్యః కలాన్స్వీకృత్వా పూర్వవన్ద్రి ఇత క్రా (4) జతిస్మ తూరః కుమారన్సధ [టా] గ్రగణ్య స్సర్వరాజా [౦] సకలాశ్రమజ్ఞః కారుణ్య వా (5) న్నర్విత శత్రుహన్తా చారూదరోభాతి మదన్దే నార్యః ॥ తస్య గ్రామస్యావధయః పూర్వ (6) తః చెఱకుంబల్లి దక్షిణతః శ్రీపూణ్డి పశ్చిమతః కాపూరు ఉత్తరతః గోమసువు । అస్య గ్రామ (7) స్యోపరిన కేనచిద్బాధా కర్తవ్యః[34] కరోతి స పఞ్చమహాపాతక సంయుక్తో భవతి । స్వద (8) త్తాం పరదత్తాం వా యోహరేత వసున్ధరాం [।] షష్టివర్ష సహస్రాణి విష్టాయాం జాయతే కృమిః[35] । వ్యాసేనాప్య

అయిదవ రేకు — రెండవ ప్రక్క

(1) క్తం — బహుభి ర్వసుధా దత్తా బహుభిశ్చాను పాలితా యస్య యస్య యదాభూమి[36] తస్య తస్య తదా ఫలం।ఆజ్ఞప్తి (2) క[టు]క నృపః కవిరయ్యవభట్ట సర్వశాస్త్రజ్ఞః లిఖితం భట్టదేవేన శాసన మాచన్ద్రతారార్క (౦) ॥

34 కర్తవ్యా 35 క్రిమిః 36 భూమిస్తస్య

# శ్రీ మహాత్మా గాంధి స్తవము

కలశపూడి శ్రీశైలము గారు, బి. ఏ.

భారతధర్మతత్త్వముఁ బ్రభావము ప్రస్తుతకాలమందు నే
ధీరుని దివ్యరూపమున దేశము నెల్లెడఁ దేజరిల్లఁగన్
దారుణ దాస్యపుందపము దద్దయు స్రుక్కఁగ నాత్మశక్తి వి
స్తారపటుత్వముం దెలియఁజేసిరి భారతదేశవాసు, లా
పారగభీరు శాంతగుణసాంద్రుని, నిస్తులలోక సంగ్రహా
ధారుని, గాంధిదేవుని, విధాయకమంచు నుతింతు నెంతయున్

ఉ. వ్యక్తశరీరుఁడై మహాత్ముఁడయిత మాటను నే బుషినామ మిప్డు పం
చాక్షరి సన్నిభంబగుచు సర్వజనాస్యములందు మ్రోయుచున్
రక్షణమయ్యెఁ గ్రూర పరరాష్ట్రపబాధ లడంప, నా దయా
వీక్షణు, నాత్మమాధరణు, ద్వేషవిదూరుఁ బ్రశాంతు, నాహిర
ణ్యాక్ష సహోదరాత్మజ సమంచిత వర్తను, గాంధిఁ గొల్చెదన్

శా. స్వార్థత్యాగ విశిష్టలక్షణము దేశశ్రేయ మన్నట్టి స
త్యార్థంబున్ బ్రకటించి, యాత్మబలమున్ స్థాపించి, యేధీరుఁడా
త్యర్థప్రార్థన నెల్లమాన్ప నిరపాయంబైన మార్గంబునన్
వర్ధిల్లంగ నొనర్చి దేశమును గాఢంగ జన్మించె, నా
నిర్ధూతాఖిల కల్మషున్ గొలుతు గాంధిన్ సత్యసంపన్నునిన్

ఉ. బంధుర శాంత సాత్త్విక విభాకర తేజము జూపిఁ ద్వేషభా
వాంధము బాపి, నిస్తుల మహాయనిరాకృతి నల్పి, దాస్యపుర్
బంధము ద్రుంచి, సర్వసుఖవర్ధనమైన స్వరాజ్యమున్ దయా
సింధుఁ డజాతశత్రుఁడు ప్రసిద్ధుఁ డెవం డిట నిల్పుచుండె నా
గాంధిని సత్యసంధుని బ్రశాంతుని నిశ్చలభక్తిఁ గొల్చెదన్.

ఉ. కష్టములన్ సహించి కడకన్ మనభారతమాత పుత్రకా
మేష్టి నొనర్చియుండ బ్రభవించి, చరించియు దక్షిణాఫ్రికా
నిష్ఠురవన్యభూములను, చేస్తమునల్పి మహామ్మదీయులన్
శిష్టులఁగూడి, రాజ్యరమ చేకొనఁ జెప్పెడు దాస్యరావణున్
భ్రష్టుని జేయుచుండె, జనవంద్యుఁడు, రామసమానధీరుఁడా,
శ్రేష్ఠుఁడు, దేశబాంధవశరేణ్యుఁడు, గాంధిమహాత్ముఁ డెంతయున్
నిష్ఠను గొల్చు నాహృదయనీరజమందు వసించుఁగావుతన్.

# ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయఁదగిన స్థానము

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

నాచన సోముని కవిత్వముఁ జర్చించుచు పైపేరుతో నేను కొన్ని యేండ్లక్రిందట వ్రాసిన వ్యాస మాంధ్రదేశీయ పండితుల కనేకుల కాందోళనముఁ గల్గించినది. శ్రీ శతావధాని వేలూరి శివరామ శాస్త్రులు గారు, చేకుమళ్ల అచ్యుతరావు గారు, దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు, నడకుదుటి వీరరాజు పంతులు గారు మొదలగువారు పై విషయమును జాలఁ జర్చించిరి. శివరామ శాస్త్రి గారు 'నాచనసోముఁ' డను గ్రంథమున నతని గుణదోషముల రెంటిని జర్చించి మధ్యమణిన్యాయము వహించిరి. అచ్యుతరావు గా రాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో సోముని జాలఁ బొగడి నాసిద్ధాంతము (సోముని కవిత యెఱ్ఱనకవిత కన్నఁ గొఱత యను విషయము) ఖండింపఁ దగినదని మాత్రము వచించి యుదాసీను లైరి. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారును నాసిద్ధాంతమును సమగ్రముగ ఖండించుచు కొన్నాళ్లక్రింద నెల్లూరిలో నుపన్యసించి రఁట. శ్రీ వీరరాజుగారు విమర్శరూపముగ నొక గొప్పగ్రంథమే వ్రాసి రఁట. కాని, యందలి కొంతభాగము మాత్రమే కడచిన సంవత్సరాదిసంచికలోఁ బ్రకటించిరి. సోమునికన్న నెఱ్ఱన మే లను నామతము నంగీకరించినవారు శ్రీ నాగపూఁడి కుప్పుస్వామయ్య గారొక్కరే యిటీవలకు నాకుఁ గానవచ్చినవారు.

నేను వ్రాసిన నలువదిరెండుపుటల వ్యాసమందు ప్రత్యక్షరమును ఖండనీయ మని తలఁచినవారు వీరరాజు గారు. అందు లోపము లనేకములు కల వని నే నెఱుఁగుదును. కాని వీరరాజుగారు తలఁచినట్లు దోషములు తప్ప నేమియు నందు లేదని తలఁపవలసినంత యక్కఱ నా కింతను దోఁపలేదు. శ్రీ శివరామశాస్త్రులు గారు నాయందలి లోపములను జూపుటయే కాక, గ్రాహ్యములైన విషయములఁ గూడ మఱుఁగుపఱచక యంగీకరించిరి. శ్రీ వీరరాజుగారి సంపూర్ణగ్రంథము బైలుపడువఱకును నే నూరకుండవలసినదే. కాని, వారి ఖండనఖండముఁ జదివిన తరువాత వారి విమర్శనమార్గము గుణపక్షపాతము గలది కా దని స్పష్టమై, ఇంతకన్న గ్రంథములో చెప్పుకొనవలసిన దేమియు నుండదని నే నూహింపవలసెను. కావున నేను వ్రాయవలసిన దంతయు నిప్పుడే సాధ్యమైనంతసంగ్రహముగా వ్రాయఁగలను.

మొదలు ఫల్గు, పరంధామ, శబ్దములఁ గూర్చి నా పొరపాటు తెలిపినందుకు వారికిఁ గృతజ్ఞుఁడనై వందనము లర్పించుచున్నాను. పైవిషయము మొదలే తెలిపిరి గాన శ్రీ శివరామశాస్త్రులును నాకు వంద్యులు. బలరాముని గదుఁ డను పేర సోముఁడు వ్యవహరించినందుకు వా రిచ్చిన సమాధానము యుక్తమైనను తృప్తికరము గాదు. బలభద్రునిచేత నంతకు మున్న 'ఈషాదండ' మున్నట్లు సోముఁడు వర్ణించె నే కాని 'గద యతనిచేత నున్న' దెప్పుడును చెప్పలేదు. కావున 'గదుండు సగదుండై గదాధరుఁ డ కిట్లనియె' యిత్యాది స్థలముల 'గదగలవాఁడ'ని వ్యుత్పత్తిని గల్పించినను, సోముఁడు 'భాషాభూషణుఁడు' కాఁగలఁ డేమో కాని, బలరాముఁడు మాత్రము 'గదుఁ' డగుట కష్టము. పోనిండు. పైపొరపాటు లొకవేళ నే జేయకుండినను, నావ్యాసము నిర్దుష్టము గానేరదు. అందలి యభిప్రాయములు కొన్ని నాయిప్పటిరుచికి విరుద్ధములుగా నున్నవి. నాచనసోముఁ డెఱ్ఱనకన్న నొకవన్నె తక్కువ యను నామత మిప్పటికిని మాఱలేదు. గాని, నే నతనికిఁ జూపవలసినంత గౌరవము నా వ్యాసమునఁ జూపనైతి నని చింతింపవలసి యున్నాను.

శ్రీ వీరరాజు గారి మొదటి శంక, 'ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము' వా రింత దోషపుంజ మగు వ్యాసము నెట్లు బహూకరించిరి?' యని. బహుమాన మేర్పఱిచిన విషయమునకై వచ్చిన వ్యాసములలో మేలైన దని పరీక్షకులకుఁ దోఁచినదానిని బహుమానించుట సంప్రదాయమే కదా! వచ్చినవ్యాసములలో మే లన్నారు గాని యన్నివిషయముల మేలని వారు తలంప లేదని నానమ్మిక. మఱియు నావ్యాసము బహూకరించిన పండితులలో శ్రీ వావిలికొలను సుబ్బరావు గారు, జయంతి రామయ్య పంతులు గారు, మానవల్లి రామకృష్ణ కవి గారును గల రని విన్నాను. వీరిలో నెవరు గాని నామతమును నేఁటికి నంగీకరించునట్లు లేదు. ఈ విషయము పై సమాజపుఁ గార్యదర్శులును, సోమపక్షపాతులు నగు శ్రీ కురుగంటి సీతారామయ్య గారు వచించిరి. పైవిషయము తెలియక శ్రీ వీరరాజుగారు నాయందు వారికిఁ దోఁచిన యపాండిత్యము బహుమతిని గాంచుటకు సమాజపండితుల యపాండిత్యమే ప్రధాన కారణ మని యొక యన్యాయ్యపు టూహను బైలుదేర్చిరి! పైమూవురి పాండిత్యము నాంధ్రలోక మంతయు చక్కగ నెఱిఁగియే యున్నది. గావున, నేఁడు నేను వారిపక్షము వహించి స్థాపింపవలసినది లేదు. 'ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము' అను నామధేయమున మొదటిపదము స్త్రీలింగము గాను, రెండవది పుంలింగము గాను, ఉండుటచే విశేషణవిశేష్యములకు సమానలింగత్వము లేమి తప్పనియు, నదియే పైసమాజపండితుల పాండిత్యాభాసమును వెల్లడించు ననియు వీరరాజు గా రనిరి. కాని, 'తింత్రిణీవృక్షము' ఇత్యాది ప్రయోగములందు వలె, పూర్వపదము సంజ్ఞ యనియు, నియతలింగక మనియు కావుననే 'వర్ధనసమాజ' మని పుంవద్భావము రాక 'వర్ధనీసమాజ మనియే యుంపఁబడిన దనియుఁ బంతులుగారు నిదానించి చూచి

యుండి లేని మైప్రయోగము, వారి 'మహానంద' మను ప్రయోగమునకన్న వేయింతలు సాధు వని గ్రహించియుందురు. సంజ్ఞ మనమే కల్పించినది. గావున సమాజపదమునకుఁ దగినట్లుగా 'వర్ధన' సమాజ మనియే యేల పేరుంచి యుండఁగూడ దందురేమో! నామధేయములలో స్త్రీలింగపదములయం దున్నరుచి పుంపదములయం దుండమికి మానవమనోధర్మము ప్రమాణము. ఇక 'సమాజ' మునకు బదులుగా 'సభ' యుండిన నీకష్టము లేకే యుండు లేని, సభాసమాజపదముల కర్థమందుఁ గల భేదము నా కెఱుఁగనిది గాదు. ఇట్టే 'కాశ్మీర' పదమునకు నా కర్థము కాలే దని వ్రాయుట వారి ముఖోల్లేఖము సరిగదా, నాతోఁ బాటు సమాజపండితులకును గాలే దనిరి. 'కాశ్మీర' మనఁగాఁ జందన మంటిని. కలపము, అత్యాధనము గూడఁ జందన శబ్దమున కేను వాడుదును. అత్తరు రిక్కలు రాచిన పన్నీటికేఁ గూడఁ జందన మని యుండలి వాడుక * మైశబ్దమును గూర్చిన నా యాక్షేప మల్ప మనియు, నేఁ జేయరాని దనియుఁ బంతులుగారితో నంగీకరించుటకు నాయభ్యంతరము లేదు. నేను ప్రయోగించిన 'మైనసే' శబ్దముపై వారి యాక్షేపము నెట్టిదే. అల్లన, మెల్లన, లోన, నెట్టిన ఇత్యాదికళ లన్నియుఁ బ్రకృతము ద్రుతాంతములుగా మాఱినవి. 'మైన' గూడ నట్టిదే. 'నఱకెం దత్తిమిరంబు నంబునము లోనం డోఁచు, అని సోముని ప్రయోగము. 'పొడవు' 'పొడువు' రెండును వ్యవహారమున సామాన్యములు.

పోనిండు. కవిత్వమర్మములను బరిశీలింపఁగా సోమునికన్న నెఱ్ఱన యుత్తముఁ డని నేనును, కాదు సోముఁ డుత్తముఁ డని పంతులుగారును వాదించుచున్నాము. అసలు ప్రాచీనమహాకవుల నొకరితో నొకరిని పోల్చుటయే యసంగత మని కొందఱు పండితులు తలఁచెదరు. కాని నా కామతమున గౌరవము లేదు. భరతఖండమును పాలించి ధర్మస్థాపన చేయుటమాత్రము చూచితి మేని, చంద్రగుప్తుఁడును గృష్ణదేవరాయలును తుల్యగౌరవార్హులే; కాని, వా రిరువురిలోఁ గల భేదము గమనించి- రాయలకన్న గుప్తుఁడు గొప్పవాఁ డని యొక్క రన్నను, అది రాయల నగౌరవపఱచినట్లు తెలియఁదగునా? తాతగారు గొప్ప పండితు లన్నమాత్రాన కుమారుఁడు తండ్రి నవమానించిన ట్లౌనా? అట్లే యెఱ్ఱనసోమనల కిరువురకును తెనుఁగు జాతియే యప్పుపడి యున్నది. వారిపేరు చెప్పుకొని బ్రతుకవలసి యున్నది. కాని, వారిరువురిలో నెవరికన్న నెవరు గొప్పవా రని సకారణముగఁ దలఁచినను, ఇతరునియెడ గౌరవమున కేలోపము నుండదు. మఱియు, 'సోమునికి వాఙ్మయమున నిట్టిపోటని యిచ్చు నధికారము మన కెక్కడిది?' యని పంతులుగారి యాక్షేపము. తిక్కనను 'కవిబ్రహ్మ' యని వినుతించిన యెఱ్ఱన కీ యధికార మెక్కడిది? 'వాణి రాణి' యని పినవీరభద్రుఁడు మిఱుగుమర్యాద లేక చాటిన మాత్రాన, మన మందఱము నతని యోగ్యతాయోగ్యతల విచారింపక, తలవంచుకొని, 'పినవీరభద్రుఁడు మాత్రమే' యని యంగీకరింపవలసిన దేనా? సోముఁడు గొప్పవాఁ డని చెప్పుట కధికార మెవ్వరిచ్చిరో కాఁ డని చెప్పుటకును వారే యీఁగలరు. మఱియు నిట్టి విషయము లందు పెద్దలవాక్యమే ప్రమాణముగాఁ గొనవలయు నని వారు వాదించునట్లు తోఁచెడిని. నా కంత వినయము లేదు. అంతమాత్రమునఁ బెద్దల నగౌరవించితి నని తలఁపరాదు. 'గొప్పవారిని గౌరవించుటకు వారి సిద్ధాంతములను విమర్శించుటయే యుత్తమమార్గ' మని యొకానొక పండితుఁడు వచించిన వాక్యమందు నాకుఁ జాల నమ్మిక కలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారు, వీరేశలింగము పంతులు గారు మొదలగువారు నాచనసోముని మీఁదనె కెక్కించి రన్న మాత్రమున వారి ధ్వజలోక మంతయు వారిపల్లవినే యనుసరింపవలయునా? మఱియు, రామకృష్ణకవి గారు, వీరేశలింగము పంతులు గారు మొదలగువా రసాధారణపండితు లైనను, వారి పాండిత్యమందుఁ గాని కార్యనిర్వహణశక్తియందుఁ గాని, మావంటివారికి సూఱుపాలును లే కున్నను, ఇట్టి విషయముల నావంటివానికి వారివాక్యములే ప్రమాణములు కానేరవు. వారు చరిత్రశోధకులు. ప్రాచీనాంధ్రగ్రంథములను సంపాదించుటయందు వారి కభిమాన మెక్కువ. మూలగ్రంథములను సంపాదించి యాంధ్రవాఙ్మయమును వృద్ధిపఱచుటకును, మఱుఁగుపడి మునిఁగిన మహాకవులను బైలుపఱచుటకును వారు చాల పరిశ్రమించువారు. ఏకైన మారేశవిషయము లభించెనేని దానిగుణముఁ గొండంత చేసి, యందఱును దాని నెఱుఁగునట్లు చేయువారు. తత్ప్రవృత్తి కన్న నభిమానము చరిత్రశోధకుల పొగడ్తలకు వన్నెపెట్టును. నన్నిచోడుని కుమారసంభవము బైటికిఁ దీసినపుడు శ్రీ కవిగారు, 'రాజకవులలోను కవిరాజులలోను ఇంతటివాఁడు లేఁ' డని గంట వాయించిరి. సోముని గ్రంథము వెలువడినప్పుడు వీరేశలింగము గారు నట్లే పొగడిరి. కుప్పలు కుప్పలుగా వెడలు పనికిరాని ప్రబంధములు శతకములు మొదలగువానినే చూచిచూచి రోసిన యితరపండితులు నిట్టి యుత్తమశాలి గ్రంథము బైలుపడఁగా, ఆఱునెలల పొడవుగల మనుష్యునిజూచి 'టెంకాయమ్రానిపొడవు గానున్నాఁడురా' యనిన 'ఔనురా' యని మన మందఱ మనునట్లే, ఇట్టి యతిశయోక్తు లప లక్ష్యము లేక యంగీకరించిరి. పదార్థము నందిదిగావున పొగడ్త కొంచె మెక్కువయ్యను ఒప్పుకొన్నది.

'ఏకతః సర్వశాస్త్రాణి తులసీకాష్ఠ మేకతః
వక్తవ్యం కించి దత్యుక్తం వస్తుతః తులసీ వరా'

యను నీలకంఠదీక్షితుని మాట మనము మఱవరాదు. శిష్యుఁడైన

---

* కాశ్మీరపదము గాక నా కర్థము గాని పదము లనేకములు సోముని హరివంశమున నున్నవి. శ్రీ శివరామశాస్త్రులు వారు నిట్లు తలంచిరి. 'భుజము కుంజరముచే' ఇత్యాది పద్యమునకు శ్రీ వద్దాది సుబ్బారాయఁడు గారు, వావిలకొలను సుబ్బారావు గారు మొదలగు పండితులు సమంజసముగ నర్థము నాకుఁ జెప్పలేరి. శ్రీ వీరరాజుపంతులు గారు సోముని హరివంశమునకు వ్యాఖ్య వ్రాసి తెనుఁగువారి నుపకరింతురు గాక.

కేవల దశకుమారచరిత్రమును తెనిఁగించుటచే నతని యుత్తరగుణములకు నకుఁడైన తిక్కన 'అభినవదండివి రా బావయ్యా' యని పిలిచియుండును. అతని కదే బిరుద మయ్యెను. కాని నేఁడు సంస్కృతాంధ్రములఁ బ్రక్కలో నుంచుకొని చూచినవారి కెవ్వరికి దండికేతనల కజగజాంతర మని తోఁపదు? అంతమాత్రమున తిక్కన స్మరించి మ్రొక్కని తెనుఁగువాఁ డెవఁడు?

ఇట్లు మా యిరువురకును మార్గములు వేఱు. పెద్దలవాక్యములు స్థాపింపఁజూచువారు వారు. వారుచికి పెద్దలవాక్యములు సరిపోవునా యని చూడఁ బ్రయత్నించువాఁడను నేను. ఐనను నాపలెనుండునుగూడఁ బెద్దల యంగీకారము గల దని నే నొక కారణముఁ జూపితిని. అదేదన సోముని విడిచి యెఱ్ఱనను కవిత్రయములో నొక్కనిగాఁ బరిగణించియుండుట. సోమునికన్న యెఱ్ఱనయే ప్రాచీనుఁ డను సిద్ధాంతమునే వీరేశలింగము పంతులుగారు మొదలగువారు తొలుత నంగీకరించియుండిరి. తరువాత బుక్కరాజు శాసనము వెలువడి వారిరువురును సమకాలికు లని తేలినది. నేను వ్యాసము వ్రాయునపుడు పంతులుగారి కవిచరిత్ర పూర్వముద్రణము మాత్రము చూడఁగల్గితిని. (నేను మైసూర నుండుట యాంధ్రులు మఱవరాదు) ఎఱ్ఱనహరివంశము బాగుగ నుండలే దను తాత్పర్యముతో సోముఁ డుత్తరహరివంశము వ్రాసె నని పంతులుగారు రూహించిరి. నేను నట్లే తలఁచితిని. రెండు గ్రంథములను బోల్చిచూడఁగా, ఎఱ్ఱనపురాణకవిత్వమునకు సోముఁడు ప్రబంధపు మెఱుఁగులు పెట్టినట్లు కానవచ్చినది. ఆ విషయమే నేను వివరించితిని. పరిషత్పత్రికలో నది ప్రకటింపఁబడుటకుఁ గొంత ముందుగా ఎఱ్ఱనకన్న సోముఁడే ప్రాచీనుఁ డను వాద మొకటి శ్రీ వంగూరు సుబ్బారావుగారు వెలువడించిరి. చరిత్రపరిశ్రమ మెక్కువలేని వాఁడ నగుటను, ఆవివాదవాఙ్మయము పూర్తిగా నాకు లభింపమిచేతను, ఆవిషయము చర్చింపక, శ్రీ సుబ్బారావుగారి వాదమే సత్యమైనను, సోమునికన్న యెఱ్ఱన యుత్తమకవి యను సిద్ధాంతమున కేమియు బాధ లేదనియు, ప్రాచీనుని విడిచి యర్వాచీనుని కవిత్రయములో నొక్కనిగాఁ బరిగణించుటయే నిదర్శన మనియు, భూమికలోఁ జేర్చి పంపితిని. అది యచ్చే ముద్రిత మయ్యెను. ఎఱ్ఱనను కవిత్రయములోఁ జేర్చుటకుఁ గారణ, మే 'నాలవకారము' కాలుఁ డైనను చెప్పఁగలఁ డని వీరరాజుగా రనుచున్నారు. అది భారతశేషమును బూర్తిచేయుటయే యేఁటి! 'పంచమవేదము'ను తెనిఁగించిన వారిలో నథర్వణాచార్యుఁడు లేఁడా! ఆధునికులలో తిమ్మయ లేఁడా? వీరినిగూడఁ జేర్చుకొని కవిచతుష్టయమో కవిపంచకమో యని యేల చేయరైరి? తిక్కన భారతము వ్రాయుటచేతనే కవిబ్రహ్మ యయ్యెను గాని, యదే శైలిలో నికనే గ్రంథమును వ్రాసియుండినను అతని కాబిరుదము లభించుచుండెడి దందురా? నిజము చూడ, తక్కినదేశముల కన్న తెనుఁగువారికి భారతమం దెక్కువ గౌరవము గలుగుట తిక్కనాదులవలననే. గాని, గౌరవమున రామాయణ మెందులో తక్కువ? మఱియు, భాస్కర రంగనాథ రామాయణాదుల కంటె నెక్కువ కవిత్వము గలిగియుండెనేని, ఎఱ్ఱన రామాయణ మేల యంతరించుచుండె నని వీరరాజుగారి ప్రశ్న! దీనికి నే నెట్లుత్తర మీయఁగలనో తెలియకున్నది? అంతరించుట యనఁగా నచ్చుపడకుండుట యని యర్థమా? సోముని హరివంశమును మొదటినుండి లేని కవిత్వము వీరేశలింగము పంతులు గారి కాలమున నెవరైన నించిరా? లేకున్న నంతవఱకదేల 'యంతరించి' యుండవలయును? మఱియు నెఱ్ఱన రామాయణము పూర్తిగా నశించిన దనియే నిశ్చయముగఁ జెప్పఁగలవా రెవరు? తెనుఁగుదేశ మంతయు నెవరు గాలించి చూచినారు? అలాభము నాశమే యగునా?

'చ. పలుకఁ దలంప దవ్వ లగు భారతరామకథార్థముల్ విభా
సిలఁగ నరంటిపం దొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్ర వా
క్ప్రలలితశక్తి నందఱకు సుప్రథితంబుగఁ జేసినట్టి ధ
న్యుల మతియించి సన్నుతమనోగ్రతఁ దిక్కన నెఱ్ఱసత్కవిన్'
(క. అ. ౧.)

పై నూరనార్యుని పొగడ్తలో నర్థాధికాధికార మెఱ్ఱనదే కదా? రంగనాథుని, భాస్కరుని నూరన మొఱుఁగఁడా? జనిచే అత్యుత్తమఖ్యాతిం బొందితి, నని వేమారెడ్డి తలఁచెనో, అట్టి రామాయణము నశింపవలసినదే యగు నేని యది వ్రాయఁబడుచునే యుండ లేదు. అది నేఁడు గాకున్న రేపు లభింపఁగల దనియు, నప్పుడు వీర రాజుగారు తమ యభిప్రాయమును మార్చుకొనవలసియుండు ననియు, నానమ్మిక.

మఱియొకమాట. ఇప్పుడు లభించిన వాదము లన్నియుఁ జూడఁగా నెఱ్ఱనసోములు సమకాలికు లను భావమే బలియుచున్నది. గాని, సోముఁడు ప్రాచీనుఁ డని రుజువుచేయఁగల సాధనము లింకను నాకుఁ దోఁపలేదు. పండితు లనేకు లట్లే తలఁచెదరు. ఇరువురిలో నెవరు పెద్దలో యెవరు చిన్నలో చెప్ప సాధ్యముగాదు. సోముఁ డెఱ్ఱన్న హరివంశమును జూచియే వ్రాసినాఁ డను భావము నాకింకను గ్రహింపలేదు. అనఁగా నెఱ్ఱనకన్న నతఁడు పాండిత్యమునఁ దక్కువ యని నాయాశయము గాదు. ఎఱ్ఱన వృద్ధుఁడై, సోమన తరుణుఁడై సమకాలికస్పర్ధచే నతఁడు వ్రాసిన గ్రంథము నే యింకను మెఱుఁగుగ వ్రాయవలయు నని పూనినవాఁ డని తలఁచెదను.

'అభ్రంకషంబైన యాలపోతు నిలంచుత్రుంచినాఁ డీతండు పెంచినాఁడు' అను సోముని చమత్కారపూర్ణ మగు పద్యమును జూచిన తరువాత, ''యజ్ఞరక్షకుఁడును యజ్ఞవిధ్వంసియునై లోకనుతులఁ బెంపొందువాఁడు' అను కల్పనలేనిపద్యము నెఱ్ఱన వ్రాసినాఁడన్న నాకు నమ్మికలేదు. సోముని గ్రంథము నందలి "నిండారఁ దెగఁగొని నిగిడించు తూఁపుల" "చేతులఁ గనీ వోఁ గయ్యము" అను రెండుపద్యము లెఱ్ఱనగ్రంథమందు లభించుచున్నవి. కాన, సోముని హరివంశమును జూచియే యెఱ్ఱన వ్రాసె నని పంతులుగా రనుచున్నారు. కాని యిందలిపద్యములే యం దున్నవని యేల చెప్పరాదు? సోముని గ్రంథమునం దేర్చి తీసికొనఁబడియు నన్న యెఱ్ఱన కింతకంటె మంచిపద్యములు దొరకవయ్యెనా? లేక, యామాత్రపుఁ బద్యములు వ్రాయవచ్చునేరని సరిగ ప్రబంధపరమేశ్వరుని ప్రతిభ యుంటుబడెనా? ఎఱ్ఱన్నకు సహజ

ముగ చాలని చిత్రకళాకౌశలము పైరెండు పద్యములు చేర్పుటచేఁ బూర్తియయ్యె నని తెలుపు వెల్లువటువంటి దెవఁడైన నంకువా? ఇందులఁగూర్చి విశేషచర్చ వేఱొకచోఁ జేసెదమనిరి. సరి; అందాఁక వేచియుండుట నాకు విధి.

ఒకవేళఁ బై రెండుపద్యములను సోమునివే యని పండితులు గారు స్థాపింపఁగల్గినను, నే నిట్లు తలంతును. ఎఱ్ఱన గ్రంథము లన్నియుఁ జాల దురవస్థలపాలైనవి. భారతభాగమే కొంత మేలు. నృసింహపురాణ హరివంశములు రెండును అనేక దుస్సంస్కరణములఁ బొందినవి. రామాయణ మింకను బైలుపడనే లేదు కదా! నృసింహపురాణపుఁ దాటాకుల ప్రతి యొకటి యొక ప్రక్క శిథిలమై యుండఁగా, సాధువొక లోకరాభాగమంతయుఁ బూరించి రని వదంతి గలదు. ఎంతనిజమో యెఱుఁగను. సోముని కవనమునం దితరులు దూర్చిన కవిత్వాభాసమును పండితులుగా రెఱుఁగక పోలేదు. అట్లే హరివంశమునందును ఎఱ్ఱనవి కావని తోఁచు భాగములు చాలఁ గలవు. యతిగణప్రాసాదిభంగములు, అర్థశబ్దవైకల్యములును, దిక్కులేక యున్నవి. వానిని సవరింప నిది కాదు చోటు. అట్టిచో గ్రంథపాఠమును సవరించుటకై పై సోమునిపద్యము లెవఁడో చేర్చియుండును. కాని, ఎఱ్ఱనపై దయచే శిల్పభిక్షము నితని నుండి దొంగిలించి యీవలయు నని, నాకుఁ జూడఁగా కాదు.

ఎఱ్ఱన సోమనల పరస్పరభేదమును గూర్చి నా యభిప్రాయ మిప్పుడు చెప్పుటకు మున్న నే నెట్టి కవిత్వధర్మ మాధారముగాఁ గొందునో, యది సంగ్రహముగా నిందు వివరించుట యావశ్యకము. కావ్యమునకు జీవనము రసము. ఇప్పటిపండితుల కనేకులకు చమత్కారమునకును రసమునకును భేదము లేదు. కావ్యమున దీనిచే మనమున కెట్టి యానందము గల్గినను, అందుకు రసమే కారణ మని భ్రమించి 'ఎంత రసవంతమైన కావ్య' మని మెచ్చుకొనుట వాడుక. 'రసము లేవలయు నన్న వసుచరిత్ర కావలెనే వలయు' నని యుద్ఘోషించువా రున్నారు. శ్లేష తప్ప వేఱొకటి చేరనివారికి 'సరసకవిచక్రవర్తి' యని బిరు దిచ్చువా రున్నారు! పాండిత్యమును ఉపజ్ఞయుఁ గల చోట రసము గల దని భ్రమించెదరు. కావుననే కల్పనాకవిత్వము వృద్ధికిఁ దెచ్చిన ప్రతికవియు నొక 'సరసప్రబంధము' వ్రాయఁ బూనితి ననుచున్నాఁడు! మన వాఙ్మయమున నాలోకోత్తరపదము నకు వచ్చిన దురవస్థ మఱి చెంకిని రాలేదు. రస మనఁగా, మన లాక్షణికులు నియమించినట్లు శృంగారము మొదలగు తొమ్మిదిభేదములే కలిగి 'యలౌకికచర్వణావిషయ' మగు నొక వివరింపరాని పదార్థ మని నాయుద్దేశము గాదు. తర్కశాస్త్రపరాధీను లగు మన లాక్షణికులు వాదవివాదములను పెంచి యెవరో వ్రాసిన రసలక్షణముగే స్థాపింపఁబూని, రసశబ్దమునకు మార్గమును సంకోచపఱిచి రని నా యభిప్రాయము. రసపండితుల సిద్ధాంతము ప్రకారము.

"ఆలోఎంతి పులిందా పక్వఅ సిహరట్ఠిఅ ధణుణికణ్ణా,
హత్థిఉ కేహిఅ విందూఆ పూరిజ్జంతం ణవణ్ణేహిమ్"
[కా. స. ఉ. శ. ౧౬.]

ఆ. చెంచువఁగలు ముదముచేఁ జూచుచున్నారు,
వింధ్య మూని శిఖరవీథి నిలిచి,
మత్తగజము లట్లు క్రొత్త మేఘంబులు,
ప్రాఁకుచున్న వింధ్యపర్వతంబు.

అను హాలిని పద్యమున నేరసమును లేదు. కాని, దీనిని జదువునపుడు ఆ యొండవహూఁడిన పర్వతరాజు, ఉక్కుబొమ్మలవంటి చెంచుదొరలు, వారు చేతులూనుకొన్న విండ్లు, చలువనీడనిచ్చుచు వానకాలము సూచించు క్రొక్కారు మొగిళ్లు - ఇవన్నియు మన కన్నులఁ గట్టితోఁచును. విండ్లపై నూని వింధ్యము నభిమానప్రమోదములతోఁ జూచు చెంచువఁగలకెట్లో యట్లే, మనకును తన్మయత్వము గలిగి, నిర్వచింపరాని యానందము గలుగును. లేదన్న నాకిప్పు లేదు. శృంగారము మొదలగు రసముల 'చర్వణ' యలౌకిక మేమి? యిది లౌకిక మేమి? ఏ భావములైనను వాని తీక్ష్ణదశలో నవిరత వేద్యాంతరముగా ననుభవింపఁ గల్గుట మేని, యానందస్వరూపములై రసశబ్ద వాచ్యము లగును. అనఁగా శిల్పమందన్న మాట. జుగుప్సార్థకీర్తివాత్సల్యాదులు గూడ రసములే యని వాదించినవారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నొరయూసినను హృదయమును మాయఁజాలదు. కావున, కవి భావనాబలముచే తనకుఁ గలుగు వివిధములగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము, మొదలగు భావము లనఁబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహము (ఏవిగ్రహమైనను సరే) సరసమగు భావతోఁ దీర్చి యెదుర నిలిపినపుడు రసానుభవ సంస్కారము గల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి, అవి యెట్టివైనను, శిల్పమందుఁగల యొకానొక యనిర్వచనీయ మహిమచే, ఆనందముగాఁ బరిణమించును. ఈయర్థమందే ప్రకృతము రసపదమును నే నుపయోగించెదను. అది యిన్నే విధము లని పలకపై సుద్దతో వ్రాసి చూప సాధ్యము గాదు.

కవిత్వమహామాన్యమున కది ప్రాణము. కవి దానిని తీర్చిన కొల్ల నందుకుఁ దగిన మర్యాదఁ బొందును. శక్తిసగుణములు, అలంకారములు, రీతులు, పాకములు మొదలగు నర్థశబ్దధర్మము లన్నియు నా భావధర్మమున కుపస్కారకములు గాఁగలవు. గాని, దానితరువాతివి. వీనిని చక్కఁగా నిర్వహించుటచేఁ గూడ నొక యానంద ముదయించును. గాని, అది రసముతోఁ దులఁదూఁగదు. వీనిని గూర్చిన యొండు రెండు లోపములను గమనింపక పోవచ్చును. గాని, మూలమగు రసమున కీమాత్రపు విఘ్నము గల్గినను రసికులు సహింపలేరు.

ఇది మనసున నుంచుకొని యెఱ్ఱన సోమనల కవిత్వములను బరిశీలింపఁగా, రసపోషణదృష్టి యెఱ్ఱనకన్న సోమునికి దక్కువ యని నాకుఁ దోఁచెడిని. సోముని సర్వజ్ఞబిరుదము, నవీనగుణసనాథత్వము మొదలగు వానిని గూర్చి నాయాక్షేపము లేదు. అతని పాండిత్యమును గూర్చి నేఁ జేసిన యాక్షేపము లల్పము లనియు నేఁ జేయరాని వనియు నంగీకరించితిని గదా! అతఁ డష్టాదశపురాణముల మఱి పురాణములతోఁ గూడఁ జదివియున్నను, లేకున్నను, ప్రకృతము

మనకుఁ బరికించవచ్చిన దతని కవిత గాని పాండితి గాదు. ఎఱ్ఱనకన్నను బండితుఁ డని యీరంగీకరింతు రేని నా కడ్డు లేదు. ఎందుకన, సోమన పండితుఁడు గా దనుటకును బ్రమాణములు చాలవు. ఆతఁడు సర్వజ్ఞుఁడైన నితఁడు పరమేశ్వరుఁడు. మఱియు నెఱ్ఱన హరివంశాదులలోఁ గొన్నిచోట్ల నతిబల్బజము లైన భాగములును గలవు. శాంతిపర్వమునను విరాటపర్వమునను శైలిబిగువులో నడలు లేక వ్రాసిన తిక్కనామాత్యునికి లేదని మనము నమ్మవచ్చును. వంశావళి, స్తోత్రములు, ధర్మములు, మొదలగు చప్పిడివిషయములు వ్రాసినచోట్ల నతఁడు వ్రాయవలయునే యని వ్రాసె నని మన మూహింపవచ్చును. కాని, యేచోటి వర్ణ్యమైన విషయమునకును అతనికిని మానసిక సంబంధము గలదో యాచోట నతనివలె, ధారాళముగ, తీక్ష్ణముగ వ్రాయఁగలవా రరుదు. సోమునికి నట్టి రసపోషణశక్తి గల దనుటలో సందేహము లేదు. కాని యతఁడా శక్తికి స్వేచ్ఛాచార మిచ్చినవాఁడు కాఁడు. ఆకాలమునకే సంస్కృత వాఙ్మయమున మాఘుఁడు, బాణుఁడు సుబంధువు, రాజశేఖరుఁడు మొదలగువారిచే స్థాపింపఁబడిన కల్పనా ప్రధానమగు నాలంకారిక శబ్దార్థరచన ఇతనిని లోఁబఱచుకొన్నది. కాని రామరాజభూషణాదులవలె దానికిఁ బూర్తిగా లోఁగియుండ మిచ్చే నతని యుత్తరహరివంశము రసికుల నాకర్షింపఁగలిగి యున్నది. ఐనను రసప్రవాహమున నెఱ్ఱనకుం దున్నంత బిగువు నిర్మలతయు నితనియెడ లేవు. ఒక్కయుదాహరణము. మన్నింతురు గాక. ఉలూఖలబద్ధుఁ డగు బాలకృష్ణుఁడు తోటిని. జమిలిమద్దులనడుమ నీడ్చుకొని పోఁగా, నాచెట్లు కూలెను. అప్పుడు కొందఱు గోపికలు సంభ్రాంతలై పాఱివచ్చి యశోదతో ని ట్లనిరి.

"ఉ. ఎక్కడిబిడ్డ నీకు? నిటు లెంతయుఁ గట్టిఁడి. వేయుగంబులన్
బోక్కుడుతోటితో బలిమిఁ బుత్రుని ద్రాళ్ళఁగట్టినాఁడు వా
రక్కట! కల్గినే! విసఁగ నాఱడిపోయెఁ గుమారుఁ డీపున
మిక్కుటమైన మ్రాఁకు లవె మీఁదఁ బడన్ వడిఁ దాఁ
[బెనంగడున్."

మ. అనినం దల్లడపుంది మేను విరియన్ హాయంచు గోపాలభా
మిని విస్రస్తముకా స్తవాంచలము ధమ్మిల్లంబు దూలంగ, లో
చనపద్మంబుల బాష్పధార లెసఁగన్, సంభ్రాంతిఁ బాదద్వయం
బును దొట్రిల్లఁగఁ బాఱె, గోపికలు సద్భ్యాతార్తలై తోఁ జనన్"

ఈ యుత్తరహరివంశమున ననిరుద్ధుఁడు చిత్రరేఖచే నపహరింపఁబడఁగా నతని యాఁడువారు,

"సీ. చెందమ్మివిరులతోఁ జిందు తేనెలవోలెఁ
గన్నుల బాష్పాంబుకణము లడర,
వలుదచీఁకట్లలో వ్రాలుచుక్కలు వోలె,
వేణీభరమ్ముల విరులు వ్రేలఁ,
దూలు తీఁగల వెంటఁ దూఁగు తేటులవోలె,
నసరు సెన్నడుమున నారు లూలయ,
రాపుఁ జక్కవలఁ జేరని చంద్రికలు వోలెఁ
జన్నుల ముత్యాలసరులు సెరఁగ,
ముద్దుమోము లల్లార్చుచో మూఁపులందుఁ
గర్ణభూషణజాలంబు గళవళింప
మార్చిమార్చి చేతుల వ్రేళ్లు మడిచికొనుచు
'నింక నెట్లమ్మ' యనుచు నయ్యింతులేడ్వ"

(ఉ. హ. ఆ. ౫-౨౭౬)

పై రెండుపద్యములను బరికింపవేఁడెదను. ఏన్ను నన్నివేళ లెంత తీ రయినను రసధార రెండవపద్యమునకన్న మొదటిదానియందు తీక్ష్ణము గాదా! రెండవదానియందు చమత్కార మెక్కువ యని యంగీకరించితి. కాని యంతమాత్రమున మనము మోసపోరాదు. యశోద వెంటనే, కృష్ణుఁడు కాలో చేయిరో విఱుచుకొన్నట్లు, ఎఱ్ఱన్న 'సంభ్రాంతి'తోఁ బరువెత్తినట్లు, మనలఁ బరువెత్తించినట్లు, ఉన్నది మొదటిపద్యము. రెండవది, యేడ్చువారితో సానుభూతికర తూలికను కన్నెలుఁ దీసికొని నిదానముగా నవ్వుచుఁ జిత్రించినట్లున్నది. 'చెందమ్మివిరులతోఁ జిందు తేనెలు' 'వలుదచీఁకట్లలో వ్రాలు చుక్కలు' మొదలగు భావము లుదారములే; చమత్కారజనకములే; కాని ప్రకృత రసముతో సంబంధము వానికి లేదు. ఇది గాదు చోటు వానికి. మొదటిదానియందు 'విశేష మేమియు లే' దని భావించెదరు వీరరాజుగారు. విశేషములకు విశేషమగు రస మందున్నది. సోముని పద్యము వ్రాయుటకు అతనివంటి ప్రతిభాశాలియే కావలయును. గాని ఎఱ్ఱనపద్యములవంటి పద్యముల నెవరైన వ్రాయఁగల రని పంతులుగా రందురు. కాళిదాసుని స్వయంవరమున కన్న శ్రీహర్షుని స్వయంవరమున 'విశేష' మెక్కువ యున్న దని, యందుచే నతనికన్న నితఁడు గొప్పవాఁ డని వాదింతు రేని వారి కొక్క నమస్కారము తప్ప నావంటివాఁ డేమి యుఁ బ్రత్యుత్తర మీఁజాలఁడు.

'లోకమంతయు సో మన్నది నేను కాదన్నా' నని తలఁచి, నాయెడ ననూయను, సోముని సర్వజ్ఞబిరుదము నెడఁ బక్షపాతమును వహింపక, యెఱ్ఱనసోమనల కవిత్వమును మఱియొకసారి పంతులుగారు పరిశీలింతు రేని, నావ్యాసము నంత యెక్కువగా నిఁక మీఁద ఖండింప రని నానమ్మిక. వారి సిద్ధాంతము నే ఆని మొదటనే విన్నవించితిని. సోముని పాండిత్యము, పదవాక్య ప్రమాణజ్ఞత, మొదలగునవి వారి యభినందములకు మూలములు. నా దనసోముని తక్కిన బిరుదము లెట్లున్నను 'సాహిత్యరసపోషణ'బిరుదమున కతనియోగ్యత కొంత యున్న దని నామతము. ఇది గమనింపక వారు నామతమును ఖండించిరి.

"మ. ధనదాంతఃపుర తారహారములు; యాదఃపాల బాలా ఘన
స్తన కాశ్మీరము, ధర్మరాట్కులవధూ సంవ్యాన కౌశేయమున్
దనుజేంద్రారివరావరోధ దయితా ధమ్మిల్ల మాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁ జూచు జయలక్ష్మి నిత్యనైపథ్యమున్"

ఇత్యాది సోమపద్యములలో, దిక్పాలక జయమును గూర్చి యోజించునప్పుడు నరకాసురుఁడు తనకును దెలియక యప్రదక్షిణ క్రమముగనే వారిపేళ్లను జదివినట్లు సోముఁడు వ్రాసె ననియు, అందువలన నరకునికి రాఁగల యపజయము సూచింపఁబడిన దనియు,

ఎఱ్ఱన యట్లు చేయఁజాలఁ డయ్యె ననియు వా రనుచున్నారు. ఈ కవనశాస్త్రజ్ఞానము నరకునికే లేనప్పు డెఱ్ఱన కేల యుండవలయునో? ఉండినను కవిత కది యెట్లుపకరించునో? యెఱుఁగలే కున్నాను! మఱియు,

"బలిమికోలున వప్పు డసుకొత్తినను నెంగం
బెల్లఁదాసై యున్న వెల్లఁదనము*"

అను సీసపద్యము భావపూర్ణ మని పొగడి నేను తిక్కన యొక్క "ముదమున నెలమి" యను పద్యములోఁ బోల్పఁగా పాదాంతములలో తిక్కనపద్యములో నున్నట్టి చదరపునడక యెఱ్ఱనపద్యమున లే దని చెంటికిని బోలిక యనుచిత మనిరి! ఇట్లే,

"సీ. దైతేయ మదవతీ ధమ్మిల్లములతోడ
విరుల సెత్తావికి వీడుకోలు,
దనుజశుద్ధాంత కాంతాకటాక్షములతోఁ
గలికి కాటుకలకుఁ గానివాని,
దానవమానినీ స్తనబంధములతోడఁ
బసపుపయ్యెదలకుఁ బాయు తెరువు,
దైత్యావరోధన దయితాధరములలో
సొబగువీడెములకుఁ జిక్కుటెదురు,
చేసి, పురపుండరీక కాశీరతాళ
వృంత చలితాంతకుంతలవిలస దింద్ర
కులవధూటీ లలాటికా కుంకుమంబు
వదిలపఱుపఁ జక్రంబ! నీధరమ కాదె!"

అను సోమునిపద్యమున నాల్గుపాదములయందుఁ గల 'దైతేయ మదవతీ' 'దనుజశుద్ధాంతకాంతా' 'దానవమానినీ' 'దైత్యావరోధన దయితా' పదములందలి పునరుక్తిని వారు మఱుగు పెట్టి రాక్షసకాంతలకు విరులు, కాటుక, పసపు, వీడెము మొదలగు సౌమంగల్య చిహ్నములను శ్రీవిష్ణుసుదర్శనము నశింపఁజేయు నని, చెప్పుటచే వారికి వైధవ్యము సూచించె నని అతిశయోక్తులో నత్యుక్తి సంకరించిరి! ఇంతేకాక, 'పైధనవాంతఃపుర' యనుపద్యమున దేవతాస్త్రీలకు వైధవ్యము గలిగించుటఁ గూర్చి నరకుఁ డాలోచించువేళ "పెరిగినను, కరఁగినను, మాసినను, నలఁగినను, మఱలమఱల ధరించుకొను నవియు, సౌమంగల్యమునకు భంగము లేనివియు నగు తారహారములు, కాశ్మీరము, సంవ్యానకౌశేయము, ధమ్మిల్లమాల్యము అనుతాత్కాలికాలంకారములమీఁదికే నరకునిదృష్టి పోవునట్లు చేసినాఁడు." అని స్తుతించిరి. రాక్షస్త్రీల ధమ్మిల్లములనుండి తీసివైచిన వైధవ్యము గలిగించు 'విరులు' ను దేవతాస్త్రీల ధమ్మిల్లములనుండి తీసినను 'సౌమంగల్యమునకు భంగము లేని' 'మాల్యములు' ను వేఱుపదార్థములా? తారహారములు, స్తనకాశ్మీరము, ధమ్మిల్లమాల్యములు- ఇవి సౌమంగల్యచిహ్నములు కావేని, విరులసెత్తావి; కాటుక పసపు, వీడియము మొదలగునవి మాత్ర మెట్లగును? ఒక వేళ దేశభేదమున రాక్షసభేదమున శ్రీధర్మశాస్త్రములు వేఱువే అనుకొన్నను, వైభాగములు సోమునికవిత సమయాచారబద్ధమే కాని రసస్వాతంత్ర్యమును వహించినది గా దని బోధింపవా? రస దృష్టితోఁ జూచువారికి రాక్షసవిధవ లని దేవతావిధవ లని భేదము గలదా? పగని బోఁగొట్టుకొని యేకప్పు చేయఁదగుది గాయనను భావు కుని మనసు గరఁగింపదా? రాక్షసుల తప్పులకు వారిని సంహరించుట యుక్తమే. కాని వారిభార్యల యేడ్పులకుఁ గవి సంతసింపవచ్చునా? రావణుని జంపిన తరువాత 'మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనం' మ్మని పల్కిన యుదారహృదయుఁడగు శ్రీరామచంద్రుని కింతమాత్రము తెలియదాయెనా?

ఇఁక సోముని కవనమున నిరర్థకము లగు దీర్ఘసమాసము లనేకములు గల వని నే నచింపఁగా, నెఱ్ఱనాదులయందును గల వని వారు చూపిరి. తిక్కన వ్రాసిన యొక్క సమాసపద్యమును వెదకి యెత్తిరి. తిక్కనభారతమున నట్టి సమాసము లనేకములు వ్రాసియుండె నేని, ఆతని యుద్దేశముప్రకారము 'ఆంధ్రావళి మోదముం బొరయుం' బుండెనా? అట్లైనను సోమునిసమాసములకు నెఱ్ఱనాదులసమాసములకు సమాసత్వము సమాన మైనను అర్థాన్వయాదులలోఁ జాల భేదము గల దని పంతులుగారు గమనింపఁ దలచుకో లేదు.

"మండటిదిక్కాడి వెలత్రాటిఁ దగిలిన
లోఁకనోదుల వెంటఁ దూలువారు"

అనుపద్యము సోముఁడు మొగము ముడివేసికొనియే వ్రాసె నని వారి యభిప్రాయము. పరిహాసదృష్టి యున్న దని నామతము. మహార్థులయవస్థకు నేను నవ్వితి నని వారు భ్రాంతిపడిరి. నవ్వినది సోముఁడో? నేనో? చదువరులు మఱలనూహింతురుగాక. ఇట్లే 'పోరాని చుట్టఋక్ఁడే'ను పద్యమున నెఱ్ఱన యింద్రుని గెలిచెనె నని నేఁ దలఁచితి. నాది విపరీతవాఖ్య యని పంతులుగారు రసెదరు. కాని, ఊర్వశికి వైధవ్యమును గలిగించిన వారివాఖ్యకన్న నిది విపరీతమా?

ఈసందర్భమున నింకొక విషయము. నరకాసురుఁ డూర్వశిని బిలిపించినకథ మూలమున లేదంటిని. 'ఏ లేమూలమూచిరో?' యని నన్నధిక్షేపించి పంతులుగారు రొక శ్లోక ముదాహరించిరి. గోపాలనారాయణకంపెనీ వారి నాగరముద్రణమును, పురాణం సూర్య శ్రీరామశాస్త్రులుగారి తెనుఁగుప్రతియు నేఁ జూచితిని. కాని యీరెండుప్రతులలో 'లేమూల'లోను వారుచూపిన 'మూల' లేదు. విష్ణుపురాణమందును ఈకథ గానరాదు.

ఉషాపరిణయఘట్టము, ఊర్వశీచరిత్ర మొదలగు వానిపై వారి విమర్శమునకు నేను ప్రతి యీఁదలఁచుకోలేను. రుచిభేద మిందుకుఁ గారణము. మఱియు వారి పూర్ణవిమర్శ వింకను వెలుపడలేదు గదా! బాహ్యాసనామము, ఎఱ్ఱనపద్యములలోని పదములు,

---

* పైపద్యపాద మున్నదున్నట్లు వ్రాసితి. 'ఉన్న'కు బదులుగా 'ఉండు' చేసినచోఁ దొందఱలేదు. 'మొగమంతా కన్నతే' యున్నట్లు క్రియలేకయే వాక్యము ముగింపఁగల్గుట పంతులుగారు యెఱుఁగనిదిగాదు. ఈ దళపాదము స్పష్టపడకే దంటిని. నాను టీక వ్రాసిరి. అప్పటికిని ఎఱ్ఱనపాఠముగా నాకుఁ దోఁపదు. ఈ సందర్భమున వారు వ్రాసిన మాటలు వారికిని నాకును యోగ్యములు గావు.

వ్యాసమందలి పదఖండములు మొదలగువానిని గూర్చిన తక్కిన విమర్శను వారు చేయఁదగినదియుఁ గాదు. నేను ప్రత్యుత్తర మీయఁ దగినదియును గాదు.

కృష్ణశైలాసయాత్రాసట్టమున స్పష్టముగఁ గానవచ్చు పూర్వోత్తర విరోధమును విరోధముగాకుండఁ జేయుటకై షుమా రెనిమిది పుటల విమర్శనము పంతులుగారు వ్రాసిరఁట! సోమునియెడ వారికిఁ గల పక్షపాతమును, నాయెడ వారికిఁగల యనాదరమును నైయుండిన విషయముచేఁ జదువరులు గ్రహింపఁగలరు.

సోమునియందలి వైయక్తిమానముచే నెల్లరను మీరు చాల తక్కువపఱచిరి. దీనికి విపరీత మగు పనియే నావ్యాసమున నేను జేసితినని యంగీకరించితిఁ గదా! అందుకు నేను పరితపించునట్లు పంతులుగారును పరితపింపఁగలరా? నాకుఁ దోఁపదు. ఏలయన నెల్లర కవితయందు లేని గౌరవ మెల్లరయందుఁ గలుగుట కష్టము. సోముఁడు సింహ మనియు, నెల్లర చిరుతపులి (పెద్దపులియుఁ గాదు) యనియును వారింకను దలఁచుచున్నారు. వినవలె! చిరుతపులికే సింగము తరువాతఁ జక్రవర్తి పదవి నియ్యవలెనెను! మీరందఱుముందటి నక్కవంటివాఁడనియా నన్నయ్యకు నా లేపదవియు నీయరైరి? కాని, అతఁడు మహితాత్ముఁడని తత్త్వఁ దని వారే వ్రాసిరి! ఎఱ్ఱనకన్న హీనుఁడయ్యెనా? అతనికే యాంధ్రవాఙ్మయ సామ్రాజ్యమున నధికారము లేదని తిక్కనయొఱ్ఱన లేమని సిగ్గులేక యాయధికారమును గైకొందురు! ఎఱ్ఱనకుఁ దరువాత శ్రీనాథుఁడు ప్రయత్నించెనఁట గాని, యా సింహాసనము మాత్ర మతనికి లభింపలే దఁట! ఏల? అతఁడు కవిసార్వభౌముఁడే!

ఈ యాక్షేపవాదముల కేమి? పోనిండు. ముగింపున నొకమాట. రసికుల కెల్లరయందలి యభిమాన మెన్నఁడును గ్రహింపరు. చిత్రకర్మచే నెవరి మనసులు రంజిల్లునో, వారి కెల్లరకన్న సోముఁడు మేలుగాఁ దోఁచును. పంతులుగారు చిత్రకవితాభిమాను లని నమ్ముచున్నాను. అట్లయిన, నాయందలి యొండురెండు లోపములను సవరించినచో మతియొకతూరి వందనము లర్పింతును. అంతియ. కాని, మే మిరువురము నేకాభిప్రాయులమై చేరి వాఙ్మయసేవను జేయఁగలకాలము రావలెనే కదా! కానిండు. భవభూతి మన పాలనున్నాఁడు.

"యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కి మపి, తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ."

## కఱవు కాలము

బాలకవి దోమా వేంకటస్వామిగుప్త గారు

సీ. పుట్టినప్పటినుండి పూర్ణ భాగ్యముతోడఁ గెరలువారలను "బకీర్లఁ జేసి
తలమీఁద రెండుకాసుల నిడం గాసుఁ జేయని దరిద్రుల మహాధనులఁ జేసి
ఏపూట కాపూట యేఁగునా? యనుఁ జింత సామాన్యులందు మించంగఁ జేసి
కూలి యొంత యిడిన గూలివారికిఁబొట్ట నిండనిరీతిని నియతిఁ జేసి
గీ. మెలఁగునట్టులఁ జేసినా విలను. నీకు, నిప్పటికినైన మది నింత తృప్తి కలదె?
తగదు, తగదమ్మ! కష్టాలఁ దాళఁ గలమె? కరవుకాలమ! యిఁక లెమ్మ! కదలిపొమ్ము.

సీ. బీదవారలఁ గూడు లేదులే' దనఁ జేసి పెద్దపెట్టున సేడిపించినావు
సామాన్యులకుఁ దమ సరణిఁదప్పఁగఁ జేసి కక్కుర్తులం జెందఁ గఱపినావు
మోసమ్ము, దోసమ్ము పీసమ్ము, సందులేకుండ మించంగాను గూర్చినావు
గౌరవంబుగఁ బ్రదుకఁగ నిచ్చగలవారిఁ బెను ముప్పు త్రిప్పులఁ బెట్టినావు
గీ. ఇన్నికష్టాల నిలను జెందించినావు; ఇంక నీచేయవలసిన దేమి కలదు?
సరిగ, నిప్పటికైనను శాంతిఁ బొంది, కరవుకాలమ! యిఁక లెమ్మ! కదలిపొమ్ము.

సీ. "ట్రామేలు" పట్టాలఁ దూఁగి దొర్లిననాఁడుఁ బ్రజ లింత యారాటపడఁగ లేదు;
"ఆర్బత్తురాటు" ద్రవ్యంబుఁ దోఁచిననాఁడుఁ బ్రజ లింత యారాటపడఁగ లేదు;
"ఎమ్డను" గుండు తా "ఢమ్మ" న్ననిన నాఁడుఁ బ్రజలింత యారాటపడఁగ లేదు;
"యూరోపు" నంద్రైన ఘోరసంగ్రామానఁ బ్రజ లింత యారాటపడఁగ లేదు;
గీ. తల్లి! యొక్క నీవే తెంచి, యెల్లజగము, నల్లకల్లోలముగఁ దల్లడిల్లఁ జేయు
టేమొ, గరుణించి, మా మొఱ లాలకించి, కరవుకాలమ! యిఁక లెమ్మ! కదలిపొమ్ము.

# భావగీతములు

సుధాకరుఁడు

పల్కువెలఁదికి సత్కవుల మనసు తెలుపబడ్డంబు. సత్కవుల మనసునకు వారి కవితయే తెల్పుబడ్డంబు. సర్వకాలసర్వ స్వరూపములును కవివరుని హృదయఫలకమునఁ బ్రతిబింబించియుండును. పురాణ ప్రబంధ నాటకాదులు మొదలు, భావగీతములు చాటుధారలవఱకుఁ గల కావ్యభేదంబు లన్నింటియందు నీ గుణము స్ఫుటమై యున్నది. విరాటోద్యోగపర్వములలోఁ దిక్కన మనోవిశేష మెట్లు వికసించి యున్నదో, యట్లే శృంగార నైషధాదుల యందును శ్రీనాథుని మనోగాంభీర్యము స్పష్టముగ విలసిల్లుచున్నది. ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణమున స్వభావ సౌందర్యము ఎట్లు స్పష్టమగుచున్నదో యావిధంబుననే కళాపూర్ణోదయమున సూరనార్యుని మనోవైచిత్ర్యము తెల్లమగుచున్నది. రాయప్రోలు సుబ్బారావుగారి గీతములందు సమృద్ధమగు భావసౌభాగ్యము ఎట్లు వెల్లడియగుచున్నదో యారీతినే "ఊహాగానము" న రామకృష్ణ రావుగారి రసమహిత మగు మనస్తత్త్వము విదితమగుచున్నది. కవిత యన నేల? చిత్రలేఖనము నందును, శిల్పమునందును ఈస్వభావ మీరీతినే పరిణమించి యున్నది. అమరావతియందలి శిల్పములు పూర్వకాలపు టాంధ్రుల ప్రతిభావిశేషమును వేయినోళ్ల చాటుచుండుటలేదా? ఆగ్రాయందలి "తాజ్ మహల్" మొఘలాయీ శిల్పకారకుల యాశేషశేముషీవైభవమునకు నిదర్శనము కాదా? వేయేల? కర్తృస్వభావము తత్కృతులయందుఁ బ్రతిబింబించి యుండు ననుట నిక్కము.

అయినను, ఈ ప్రతిబింబ మొక్కొక్కప్పుడు స్వచ్ఛమై, విస్పష్టమై తనరారుచుండును. వేరొక్కొక్కప్పు డంత నిర్మలముగాఁ గన్పట్టను. అందులకుఁ గారణ మా యా కావ్యముల విషయములందలి భేదములే. నాటకముల నుదాహరణముగాఁ గొనుఁడు. అందు కవికిని పాఠకునకు గాని, కవికిని సభాసదునికిఁ గాని, సంబంధముండునా? ఉండదు. ఉండుటకును తగదు. కర్తమాటయే సంపూర్ణముగ మఱువఁజేసి నాటకమునందే హృదయమును లీన మొనర్పఁజేయుటయే మహాకవిలక్షణము. కాళిదాసాది మహాకవుల నాటకరాజములఁ జదువునప్పుడు గాని, తత్ప్రదర్శనములను చూచునప్పుడు గాని, మన కా కవివరుని హృదయాంతర్గత భావములు తెలియుచున్నవా? లేదు. శకుంతల ముద్దుపల్కులయందును కణ్వాశ్రమ దివ్య సౌభాగ్యమునందును మాత్రమే మనహృదయము లీనమై యుండును. పురాణములందు నీవిధముననే కవిస్వభావము విస్పష్టముగఁ బ్రకటమై యుండదు. పురాణమునందుఁ బ్రధానము కథ. కల్పనకు నైతము అవకాశ ముండదు. ప్రబంధములందు కొంత మేలు. కల్పనాశక్తి కవకాశ ముండును. పాత్రపోషణమునందు స్వాతంత్ర్య ముండును.

కాని, ప్రస్తుతము భావగీతములను పేరఁబరఁగు కావ్యవిశేషము నందువలె నీకనే యితర కావ్యభేదమునందును కవియొక్క భావప్రతిబింబము స్వచ్ఛమై, నిర్మలమై, మనోజ్ఞమై కన్పట్టదు. ఈగీతములను జదువునప్పుడు కవికిని పాఠకునకును మధ్య నంతరాయ మేదియు నుండదు. అప్పుడఁ బోలె కవివరుఁడు నిజహృదయాంతర్గత భావసమూహమును తన గీతములయందు వెల్లడింపఁగలిగియుండును.

'భావగీతము లన నేవి?' అని యడిగిన శాస్త్రీయముగ నుత్తర మొసంగుట యశక్యము. అలంకారశాస్త్రములందు ప్రబంధనాటకాదుల లక్షణములు వర్ణింపఁబడి యున్న తెఱఁగున భావగీతముల లక్షణములను నియమింపఁజాలము. అట్లు నియమింపఁజాలమియే దాని ముఖ్యలక్షణము. కావ్యము పురాణ మైనను ప్రబంధ మైనను విషయపరిణామమునకు మేర గలదు. అందు ప్రధానము కథ తత్సంబంధము లైనవన్నియు. కథ నైతము కొన్ని ముఖ్యమార్గముల నే యనుసరించును. ఇఁక భావగీతము లన్ననో వీనికి విషయపరిణామము లేదు. ఇందు ప్రధానము భావము-రసోత్తరమైన భావము. వీనియందు భావతరంగములకుఁ గథ యడ్డురాదు. సరసిజమునుండి వచ్చు క్రొత్తతేనియలవలె నీగీతములు నిర్మలములై యనర్గళధారలతోఁ బ్రవహించును. కావుననే వీనియందు భావపూర్ణమగు కవిమనోబింబము స్పష్టముగ వెల్లడియగుట సంభవించుచున్నది.

ఈ ముఖ్యలక్షణమున కనుగుణమైన భావగీతములకు ఉదాహరణములు మనపూర్వవాఙ్మయమున నెన్నియైన నున్నవేమో పరిశీలించి, అటుపైని నేను నిర్ణయించినభావగీతముల స్వరూపమును ప్రదర్శింతును. ఈనాఁడు మనము భావగీతము లని వ్యవహరించు కావ్యభేదము ప్రత్యేకస్వరూపముతో నుండెననుట యసంభవము. ఈస్వరూప మితర భావముల సాంకర్యముచేతనే యేర్పడినది. అయినను మనము భావగీతములం దేలక్షణమును ముఖ్యముగ నెన్నుచున్నారమో, ఆలక్షణము గలభాగములు మనవాఙ్మయమున నచ్చటచ్చట నున్నవి.

పోతనామాత్యుని భాగవతమునందలి భక్తిరసప్రధానము లగు భాగములకును, భావగీతములకును, కొంతయో పోలిక యున్నది. అందునను రెండు స్థలములందు పోలిక మిక్కుటముగా నున్నది. అవి దశమస్కంధమునందలి మణులలోఁ జేర్పఁదగినవి. గోపికాగీతలు; భ్రమరగీతలు. ఈరెంటియందును భావమే ప్రధానము. భావతరంగములకుఁ గథ యడ్డురాదు. కథాసందర్భము మిళితమై యున్నను అది సాయమై వచ్చును. కవివరుని హృదయచిత్రము ప్రతిబింబించి యుండును. ఉదాహరణమునకు క్రిందిపద్యములఁ గనుగొనుఁడు.

శా. "భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్, నాగర
ప్రమదాళీకుచకుంకుమాంకిత లసన్మాల్యాలిత దామప్రసూ

మకరందారుణితానమండిత మరుటక సాధుండు మన్నించుఁగా
కమము స్నేహపుఁదు వారకాంతల శుభాగారంబులన్ నిత్యమున్.

శా. ఒకపుష్పంబదలి తేనెఁ గ్రోలి, మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెదు భంగి సమ్మధరపీయూషంబునం దేల్చి, మా
యకలంకోజ్జ్వల యౌవనంబుఁ గొని, యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా! యీతని కెట్లు దక్కె సిరి మిథ్యాకీర్తి వహ్వెం జుమీ.

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించెదీ
సంగీతంబున నేమి సౌఖ్యమదు మెఁ? తచ్చారిత్రముల్ వింతలే!
యంగీకారము గావు మాకుఁ, బురకాంతార ప్రదేశంబులన్
సంగీతం బొనరింపు. వారిసుదు రోజ స్నీతు నిష్టార్థముల్

ఇవిగాక భావగీతములకు సరిపోలునవి మన వాఙ్మయమున శతకములు. భక్తిశృంగారరసోదంచితము లగు నీ స్వల్పకావ్యముల యందుఁ గవీశ్వరుఁడు నిజభావములను వెల్లడించును. శతకరాజములం దగ్రస్థానము నలంకరింపఁ దగిన ధూర్జటి ప్రణీతం బగు కాళహస్తీశ్వరశతకమే యిందులకు దివ్యమయిన యుదాహరణము. రసికవతంసుఁడై రాజసభాసరోవరముల విహరించిన రాజహంస మగు నీకవి విషయసుఖములకు రోసి కాళహస్తీశ్వరునకు తన హృదయము నీ శతకమున వెళ్లబోసి కొనె నని ప్రతీతి కలదు.

శా. "సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ, జాలుఁజాలు బహు రాజద్వార సౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపద రాజద్వార సౌఖ్యంబు ని
శ్చింతన్ శాంతుఁడ నాదు నీకరుణచే శ్రీకాళహస్తీశ్వరా.

శా. నీరూపంబు దలంపఁగాఁ దుదమొద ల్నేఁగాన నీ వైనచో
రారా రమ్మని యంచుఁ జెప్పవు పృథారంభంబు లిం కేటికిన్
నీర మ్మొంపుము పాలముంపు, మిఁక నిన్నే నమ్మినాఁడం జుమీ
శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీకాళహస్తీశ్వరా!

శా. పాలుం బువ్వయుఁ బెట్టెదం గుడువరా! పాపన్న! రా! యన్న, శే
శే లెమ్మన్న, వరంటిపండ్లు గొని తే, లేరన్న-నే నొల్ల నం
చే లాలింపరొ తల్లిదండ్రు! లపు డట్లే తెచ్చి వాత్సల్యల
క్ష్మీలీలావచనంబులం గుడుపరా! శ్రీకాళహస్తీశ్వరా!

ఇఁకఁ బూర్వవాఙ్మయమున మనము గమనింపవలసినది "చాటుధార." భాగ్యవశమున నెట్లో మనకు లభించిన మహాకవులచాటువులు వారి హృదయ కమలపరిమళములను వెదఁజల్లుచున్నవి. సహజసాం డిత్యవిరాజితుండును, భక్తాగ్రేసరుండును, నగు పోతనామాత్యుని స్వాతంత్ర్యేచ్ఛ యీపద్యమున నెట్లు చిప్పిలుచున్నదో పరికింపుడు.

ఉ. బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికు లైన నేమి! గహనాంతరసీమల కందమూలకౌ
ద్దాలికు లైన నేమి! నిజదారసుతోదర పోషణార్థమై.

ఇట్టి స్వాతంత్ర్యప్రీతితో, నిట్టి నిర్భయముతో, నిట్టి మనో దార్ఢ్యముతో, నిండియున్న యీ పద్యమును భావగీతములయం దెట్టి పూజ్యస్థానమున నుంపవలయునో చదువరులే యూహింతురు గాక!

ఈ కవివరుని పద్యరత్న మింకొకటి కలదు. అందలి భావోత్కర్షమును భావోద్రేకమును సాధారణముగ నాంధ్రభాషయందె గాక మఱి యే యితర భాషయందును, నెక్కడో గాని కన్పట్టదు. అట్టి కవిత లోకమున నరుదు. కావుననే పూజార్హము. మనభాషయం దట్టి రత్న ముండుట మన భాగ్యము. ఎన్నిమాఱులు పఠించినను తనివి తీరని పద్యములు. మఱియొకమాఱు ఉదాహరించుచున్నందులకు నన్ను చదువరులు మన్నింపఁగోరెదను.

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాఁకటికిం గొని పోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రికరణశుద్ధిగ నమ్మ భారతీ!

ఇట్టి భావగీతములు మన వాఙ్మయమున నుంట నవీన కవివరులకు నుత్సాహ కారణము. ఉదాహరణమునకై చాటుధారలనుండి మఱియొక్క పద్యముతోఁ బూర్వవాఙ్మయమునందలి భావగీతచ్ఛాయా విషయమును ముగించెదను. శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగభూపాలుని కొల్వునఁ బోవుదారిని సరస్వతీదేవి విగ్రహమును జూచి నుడివిన ఈ క్రింది పద్యముఁ జిత్తగింపుడు.

సీ. దీనారటంకాలఁ దీర్థ మాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య నైషధగ్రంథసందర్భమునకు
పగులఁ గొట్టించితి రుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రశేఖర క్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణ నికురంబ! శారదాంబ!

కావ్యమునకుఁ బ్రధానమైనది హృదయాహ్లాదకరమైన రసము. రసప్రతిపాదకమున కనుకూలంబైన భావము. ఈ రెంటికి నుచితము అగు భాష. ఈ మూఁటియం దెయ్యది కొఱవడినను-కావ్యము మనోజ్ఞము గానేరదు. కేవలము భాషానైపుణ్యము మాత్ర ముండిన ఫలము లేదు. రసపోషితమైనదే కావ్యము. కావ్యమునకు రసము జీవగఱ్ఱ. రసము స్థాయియై యుండిన, భావమును భాషయును దాని ననుసరించును.

రసము కావ్యపరిణామమును బట్టి వేర్వేఱు రీతుల విలసిల్లును. ఇతిహాసముల ప్రబంధములందును - నలువదిపంక్తుల భావగీతములందును - రస మెక్కరీతిగనే వెల్లడియగుట యసంభవము. ఉదక మొక్కటియే యైనను చిన్నపాత్రలలో నుండునప్పటి తీరునకును, విశాల ప్రదేశము నాక్రమించినప్పటి తీరునకును చాలభేద ముండుట సహజము. అట్లే రసమునకును ఆయా విషయములను తత్పరిపాకములను బట్టి భేద ముండును. అట్లుండుట కావ్యధర్మము.

భావగీతము సర్వసాధారణముగ నాతిదీర్ఘమై యుండును. ప్రబంధాదులతో బోల్చి చూచిన నతిస్వల్పముగ నైత ముండును. ఈ కారణమునఁ బైని నుడివినరీతి నిందు రసము కేంద్రీకృత మగును.

పరిమాణము స్వల్ప మగుటచేత రసోత్సేధము సిద్ధించును. హృదయాంతరజనిత మగుటచే స్వచ్ఛందమై, స్వచ్ఛంద మగుటచే బంధవిముక్తమై, బంధవిముక్త మగుటచే నుత్కటమై, యుత్కట మగుటచే తీక్ష్ణమై, విశాలప్రదేశము నాక్రమింపమి నిశితమై, రసము చిప్పిలుచుండును.

రసోత్పన్నమైన భావ మెట్లుండవలయునో పాఠకు లప్పుడే యూహింపవచ్చును. రసము కేంద్రీకృతమైనప్పుడు భావైక్యము మిక్కుటముగ నుండును. రసపోషణమునకు గాని భావము లనవసరము లగును. అనావశ్యకము అగు భావసమ్మేళనము రసోత్సేధమున కంతరాయమై రసనైర్మల్యమునకు భంగమును గల్పించి, రసాభాసమునకు గారణ మగును. భావమునకును రసమునకును సంపూర్ణోత్సంగము సంఘటించినప్పుడే భావగీతము హృదయోత్సవకరమై యుండును. అధునిక కవివరుల గీతములనుండి కీతి కొక దాని నుదాహరించుచున్నాను.

## కాపుపాట

ఉ. ప్రేయసి! లేచిరమ్ము, చివురించిన మావులక్రింద శీతల
చ్ఛాయలలోన యౌవన వసంతశుభోదయమయ్యె, నవ్వుచున్
చేయికి జేయి జేర్చి, పెరచింతవలన్ మఱపించు రాగముల్
దీయుచు, వాసనల్ బరిమళించెడు పోటులయందు బోవగన్.

ఉ. వ్రాలినసంజల న్మఱలివచ్చెడు గోవులఁ బాలు తీయఁగా
దోలెడుదాక, త్రాడులను దుత్తలు నావలఁబెట్టి సిగ్గులన్
పోలెడు చిన్నదాన! యెటుచూచిన నెవ్వరు లేనిచోటను
య్యాలల నెక్కి యూగ మనసయ్యెడు నీవును నేను వేడుకన్.

ఉ. పాడుట కొప్పు వేని, పడవ ల్నడిపించెదు యేటిస్రోవతే
చూడగవద్దు శీతమనముల్ తడిసేసెదు చెట్లచాటునన్
గూడిన మేను లాను కొన కొమ్మల కాపులపోలె నొక్క మా
టాడక గూరుచుండ మనమైన పొలమ్ముల గట్టునీడలన్.

[అ. రామకృష్ణారావు]

పరిమాణము స్వల్ప మగుటం జేసియు, రసము కేంద్రీకృత మగుటం జేసియు, భావైక్యమునిశితమై యుంటం జేసియు, భావగీతములు చిత్రలేఖనా సారూప్యమును కొంతవఱకు చెందియున్నవి. ఈ పోలిక ప్రకృతి సౌభాగ్యవర్ణనలందును, స్థాయీభావ విలాసాది వర్ణనలందును, నతిమనోహరముగఁ గన్పట్టుచుండును. చిత్రకారు డెట్లు తన భావనాశక్తి నంతయు వినియోగించి ఎదే నొక్క విషయమును చిత్రించునో, అట్లే కవివరుఁడును భావగీతమున నొక్కరసమును మహిత మగు భావసమూహముతో ప్రతిపాదించును. చిత్రకారు డెట్లు బలుతెరంగుల రంగుల ఛాయా స్థానముల నుపయోగించి చిత్రసౌందర్యమునకు భంగమును గల్పింపడో, అట్లే కవిశేఖరుఁడును భావగీతమున వివిధభావములను రసపోషణార్థము వినియోగించును.

ఉదాహరణార్థము రాయప్రోలు సుబ్బారావు గారి "ఎవరు" అను గీతరాజమునుండి ఒక రెండు గీతములు:—

గీ. అరుదున్న కలంకారి చీరచెఱఁగు
లవఁగ సాళాముఖంబుల నందగించె
భాద్రపద నీలనీరద పంక్తు లపుడు
వ్రాలుచుండె నభోమణి వాఁడు కళల
తామ్రపర్ణీప్రవాహంబు దరులు దాటి
కలదఁ బెట్టినయట్లు చూపట్టె, సంధ్య
నిండుకొన్న సంధ్యారామణీయకంబు
పొంగిపొరలు స్రవంతీ తరంగ శోభ
యొండొరుల ముద్దులాడుచు నుల్లసిల్లె
లపదపూర్వ ప్రణయలగ్న లాలనమున.
ఇంతలోన రక్తిమ కృశియించి పోయె.
చీకటి జడల్ ముడుల్ విచ్చి చిందులాడె.

రసమును గుఱించియు, రసోత్పన్నమైన భావమును గుఱించియుఁ జాలించి, ఇఁక భాషావిషయమును కొంత వ్రాసి విరమించెద. ఉచితమైన భాష రసపోషణమున కెంతయావశ్యకమో మఱల చెప్పనక్కఱలేదు. రసము హృదయ జనితము. దాని నితరులకు సంపూర్ణ సౌభాగ్యమునఁ దెలుపుటకు భాషయే సాధనము.

భాష రసమును భావమును అనుసరించి యుండవలెను. ఔచిత్యము లేనప్పుడు భాషయెంత నిర్దుష్టముగ నుండినను ఫలము లేదు. లక్షణాను సారముగ రచింపఁబడిన ప్రబంధముల భాషాశైలియును శయ్యయును స్వచ్ఛందము లగు భావగీతములకుఁ బనికిరావు. దీర్ఘసమాసములును, కఠినము లైన యన్వయములును హృదయాంతర జనిత మగు కవితాప్రవాహమున కడ్డువచ్చును. పదలాలిత్యము భావగీతమునకుఁ బ్రధానగుణము. భావగీతములు గీతములను మాట మఱవ కూడదు. ఆచారములోనుండు శార్దూలమత్తేభాదివృత్త స్వరూపములే కాక వేరుస్వరూపములను సైతము ప్రస్తుతకాలమున వాడుచున్నారు. నూతన మార్గమున రచింపఁబడిన లలితము లగు గీతములు కొన్ని "ఊహాగానము"నఁ గన్పట్టుచున్నవి. క్రొత్త యైనప్పుడు స్వరూప మెద్దియైన నేమి?

భూజాతిసాంద్ర కర్పూరమ్ములందు
ప్రాజ్ఞదీ పాథోలతమ్ముల యందు
మడగు పన్నవిపాట -
పాడుచు వెన్నెల తేట-
కలవు తీక్ష్ణన పల్కు తెలుఁగు పల్కులకు.

ఆంధ్రభాషామణి యిట్టి సుందరమైన యలంకారము నూతన మని పారవైచునా?

# నిమ్మరాజు వేంకటాద్రి కవి

కొణిదెన బాలకృష్ణయ్య గారు

వేంకటాద్రికవికి గుంటూరు మండలమునందలి నర్సారావుపేట తాలూకాలోని యనమదల గ్రామము నివాసస్థలము. ఈయన వేంకటకృష్ణమంత్రికిని తిరుమలాంబకును పౌత్రుఁడు. ఇతని తండ్రి వేంకటరమణప్ప. తల్లి పుల్లమాంబ. విద్యాగురువు ఇనగంటి వేంకటయోగి. శ్రీవత్సస గోత్రము. ఆఱువేల నియోగి. ఈతని యిష్టదైవము వేణుగోపాలమూర్తి. ఈగోపాలుని యనుజ్ఞవలనఁ దాను "కైవల్యకందరామాయణమును" రచించినటు లిక్కవి తన గ్రంథమునఁ జెప్పియున్నాఁడు. ఈ రామాయణము భారత మంత గొప్ప గ్రంథమై యున్నది.

వేంకటాద్రి కవియొక్క స్వీయసంతతివారు నశించిరి. కాని యీతని జ్ఞాతులు యనమదలగ్రామమునఁ బెక్కు రున్నారు. వారు చెప్పుచున్న వంశక్రమము ననుసరించి చూడ నిక్కవి పదునెనిమిదవ శతాబ్దిమధ్యమున, ననఁగా క్రీ. శ. 1740—1760 ప్రాంతమున జీవించి యుండినట్లును, కొంచె మించుమించుగ నాకాలముననే "కైవల్య కందరామాయణము" రచింపఁబడినట్లును తోఁచుచున్నది. కవి తన గ్రంథమునఁ దన సమకాలికు లగు కవులను గాని తక్కుంగల సనాతనాధునాతన కవీశ్వరులఁ గాని పేర్కొనక, గీర్వాణరామాయణ కృతికర్త యగు వాల్మీకినిఁ బ్రార్థించి, యవ్వల నాంధ్రమున రామాయణముల రచియించిన భాస్కరాదులను మాత్ర మీక్రిందిపద్యము లలో నుదాహరించియున్నాఁడు.

కం. ఘన మాదికావ్య మీవలఁ
దెనుఁగున భాస్కరుఁడు చెప్పెఁ; దేటగ జగతిన్
అనువొంద రంగనాథుం
డను నాదికవీంద్రు లెల్ల నధికత రామా.

కం. పరిపరివిధముల రఘుపతి
చరితంబులు చెప్పి రట్టి చతురులలోనన్
పరమదయాకర! యమ్మ
ద్వరకవి నే వేంకటాద్రి వనరుగ రామా.

ఈతఁడు శ్రీరామభక్తిధురంధరుఁడై "కైవల్యకందరామాయణ" మను నొకగ్రంథమును మాత్రమే రచించినటుల నాతని బంధుగులు చెప్పుచున్నారు. వారియొద్ద నారామాయణపు ప్రతి (ప్రతిక) యొక్కటి తాటియాకులపై వ్రాయఁబడియున్నది. మాతృక యేమయ్యెనో యిప్పటివారు చెప్పఁజాలకున్నారు. ఈ తాళిదళసంపుటములను నిమ్మరాజు వేంకటదాసు (పెద్దవెంకయ్య) గారు మిగుల శ్రద్ధగాఁ గాపాడుచుఁ బఠించుచున్నారు. కొలఁదికాలముక్రిందట నీరామాయణపద్యములను వీధిబడులలోని విద్యార్థులకు, అపటి గ్రామములలోని యుపాధ్యాయులు బోధించుచుండినట్లు, కొందఱు వృద్ధు లిప్పుడును జెప్పుచున్నారు. ప్రకృతము మన కలపడిన తాళిదళసంపుటము గ్రంథకర్తమనుమఁడును కీర్తిశేషుఁడును నగు నిమ్మరాజు అప్పయ్య స్వహస్తమున లిఖించినటులఁ దదంతమున వ్రాయఁబడి యున్నది.

ఈ రామాయణమున నాఱుకాండములును, ఎనిమిది యాశ్వాసములు గల యుత్తరకాండమును నున్నవి. అన్నియుఁ గందపద్యములు. ఉత్తరకాండముతోఁ గలిసి యిందలి పద్యసంఖ్య 11051. ప్రతిపద్యమునకును చివర "రామా" యను మకుటము చేర్పఁబడినది. కవి యన్నియుఁ గందపద్యములుగ వ్రాసిన తనసామర్థ్యమును గ్రంథాంతమున నిట్లు వ్రాసికొనియున్నాఁడు.

కం. కందమునకు ఘనుఁ డెందురు
చందవరము చౌడకవిని, గురిగా నన్నున్
అందముగ వేంకటాద్రియు
కందములకు ఘనుఁడె యండ్రు కవు లిల రామా.

ఈ పద్యము చౌడప్పపద్యమున కనుకరణమే గాని యన్యము గాదు. చౌడప్పకందములకుఁ గల సరళత వేంకటాద్రికవి కందములలో నొక్కదాని యందును గన్పట్టదు. గ్రంథ మంతయు రంగనాథ రామాయణము ననుసరించి వ్రాయఁబడినట్టు లందందుఁగల కథలపట్టులు చెప్పకయే చెప్పుచున్నవి. ఇందు చ్యుతసంస్కార ఛందోవ్యాకరణాదికము లగు దోషములు లెక్కలేనన్ని యున్నవి. కొన్ని ప్రక్షిప్తములును లేకపోలేదు. గాని యన్నియు నట్టివే యన నవకాశము లేని ప్రమాదములు పెక్కులు గన్పట్టుచున్నవి.

వేంకటాద్రికవికి సంస్కృతభాషాపరిచయ మంతగ లేనట్టు లాతని రామాయణమువలన మనము దెలిసికొనవచ్చును. ఇప్పటి గ్రామ్యభాషాపోషకు లగు నూతన సంస్కర్తల ప్రయోగములకుఁ దగు నిదర్శనము లిందనేకములుగ నున్నవి. కవిత్వ మంత సరసమై నదిగ నుండలేదు. కాని తనకుఁ గలిగిన భాషాపరిచయము సార్థకము చేసికొనక భాషాభిమానముననో, భక్తిపారవశ్యముననో, యింత పెద్దగ్రంథమును రచించిన వేంకటాద్రికవియొక్క సమర్థతయును ఓపికయును దలంచినపుడు మాత్రము మనకు అమ్మహాత్ముని కవితను గౌరవింపకఁ దప్పదు. మఱియు "రామకథ" గావున రంధ్రాన్వేషణమునకుఁ బనిలేదు. రామభక్తుఁ డగు నిక్కవి తన గ్రంథమున నీక్రిందివిధమున గద్యమును వ్రాసియున్నాఁడు. "గద్యము: ఇది మఱియు వాల్మీకిమహర్షికలన సంస్కృతవిరచితం బైన శ్రీమద్రామాయణ మహాకావ్యం బాంధ్రభాషగా శ్రీ తిరుమల వేంకటాచలపతి కరుణాకటాక్ష కరలబ్ధకవి నిమ్మరాజు వంశపయఃపారావార

# ఆంధ్రాయుర్వేద గ్రంథములు

ఆయుర్వేద విశారద డా. రామమూర్తి శాస్త్రి గారు

మన దేశమున నన్ని చరిత్రములతోఁ బాటు నాయుర్వేద చరిత్రము గూడ నతికష్టమువలనఁ గాని తెలిసికొనుట కనువగుట లేదు. దైవదోషమునఁ బరిపాలకులకు దూరమై యంధకారగహ్వరమున నిలీనమగు నీ చరిత్రమును దెలిసికొనుటకు నాయా కాలములందలి మహాత్ములు వ్రాసిన గ్రంథములు ప్రమాణములు. కావునఁ గూడినంతవఱకు గ్రంథాధారములతో నీ చరిత్రమును బ్రదర్శింపఁ బ్రయత్నించెదను. పాఠకు లిందలి గుణములఁ గ్రహింప ప్రార్థితులు.

## వైద్యచింతామణి

ఇది యాంధ్రాయుర్వేద గ్రంథములలో విపులముగాఁ బ్రాచీన గ్రంథ విషయములతో సహా విచారణఁ జేసిన స్కంధత్రయ సహిత మగు గ్రంథము. ఏతత్కర్త ఇంద్రకంటి వల్లభాచార్యుఁడు. ఈతని తండ్రి అమరేశ్వరభట్టు. శ్రీవత్సగోత్రుఁడు. వల్లభాచార్యుడు బసవరాజువలెఁ దన గ్రంథమున నెచ్చటను నాంధ్ర పద్యములను గాని గద్యలను గాని చేర్చియుండలేదు. కాని విషనిదానాధ్యాయమున "ఊడుగ గన్నేర్ల కోఁగఁ గరక్కాయ" యను సీసమాలిక ముద్రిత పుస్తకములందు మాత్రమున్నది. ఈ సీసమాలికయే బసవరాజీయమునఁ గూడ గలదు. ఇది ప్రక్షిప్తమైనను కావచ్చును. కాదనువారు గ్రంథంబున నెచ్చటను నొక్క యాంధ్రపదమైనను జేర్పని వల్లభాచార్యుఁడు, కేవలము నొక్క తెలుఁగుపద్యము నేల గూర్చెనో చెప్పవలసి యున్నది. మఱియు నీ సందిగ్ధప్రమాణము నాధారము చేసికొని ఇతని నాంధ్రదేశీయునిగా చెప్ప వలనుపడదు. అయినను ఇతని యాంధ్రత్వమునకు మఱి కొన్ని హేతువు లున్నవి.

(1) ఈ గ్రంథ మాంధ్రదేశంబునందే ప్రసిద్ధమై యుండుట (2) ఆంధ్రదేశమునందు గోదావరిమండలమున ఇంద్రకంటి వార లేటు లుండుట (3) ఆంధ్రుఁడగు బసవరాజు కొంచెమించుమించుగా నీ విషయంబుల నన్నియు గ్రహించియుండుట (4) ఆంధ్రదేశము నందలి తక్కిన గ్రంథములను గ్రంథకర్తలను చింతామణి ననుకరించి యుండుట. ఇట్టివింకను గలవు.

## చింతామణి స్వాతంత్ర్య గ్రంథమా?

ఆయుర్వేద శాస్త్రము ప్రత్యక్ష విషయమైనది. నిజమైన స్వతంత్రుఁడు బ్రహ్మ యని చెప్పవలసియుండును. ఇట్లు చెప్పినచో సౌశ్రుతాది శల్యచికిత్సకులకును స్వాతంత్ర్యము లేకుండవలసివచ్చును. కావున నీ యాయుర్వేదంబున స్వతంత్రమన నన్యథా యర్థము పరికల్పింపవలసియున్నది. ప్రాచీన విషయములతోఁ బాటు నూతన భూతవిషయములఁ గొన్ని నూతనములఁ జేర్చి నిబంధించుటయే ఇట స్వతంత్రత కావున నొకవిధముగా గౌణస్వతంత్రత "చింతామణి బసవరాజీయములకు గల్పింపవచ్చును.

ఉదాహరణార్థమై వల్లభాచార్యుడు చెప్పిన నూతన విషయములు కొన్ని:— (1) జ్వరప్రకరణంబున పూర్వ గ్రంథకర్తలు చెప్పిన జ్వరముల లక్షణములనే గాక "మహాజ్వరము లను పేరిట ననేకములను లక్షణములతోడ విభజించుట (2) క్షయరోగమునఁ గ్రొత్తగా నిరువది మహాక్షయలను సలక్షణముగా నిర్దేశించుట (3) కాసరోగంబునఁ బ్రాచీనోక్తభేదములే గాక ఇంకను యిరువది శ్లేష్మంబులను బంగాళీ కాస మందార కాస మున్నగు నామంబులతో వివరించుట. ఇట్లే యచ్చటచ్చట రోగభేదంబుల క్రొత్తగ విభజించినాఁడు. ఇట్లు విభజించుటకుఁ గారణము దినదినము ప్రవర్ధితములును పరివర్తితములు నగు వివిధరోగములు తత్కారణములు. ఇఁకను వల్లభాచార్యుఁడు తన గ్రంథమున నూతనంబుగాఁ జూపిన ద్రవ్యచికిత్సా విషయంబుల గొన్నిటి నుదాహరించెదను:—

(1) ప్రమేహరోగమున - గాఁచినమూత్రముచే ప్రమేహ సాధ్యాసాధ్యజ్ఞానమును వివరించుట (2) అమ్లపిత్తరోగమున "పోస్తు కాయ గసగసాలు నల్లమందు" వీనిని ప్రయోగించుట (3) మూల రోగమునందు ధూపార్థము గౌరీపాషాణప్రయోగము (4) చాతుర్థికజ్వరమున నస్యార్థము అగస్త్యపత్ర ప్రయోగము (5) గ్రహణిరోగమున నల్లమందు నుపయోగించుట (6) కంఠజిహ్వక యను కాసరోగమున ధూమపానార్థము జేపాళపుత్రేళ్ల నుపయోగించుట (7) ప్రమేహములలో "పరింగిచెక్క"ను బ్రయోగించుట (8) అగ్నిమాంద్యమునఁ జెప్పిన యోగములలో ఉమ్మెత్తవిత్తుల భస్మము నుపయోగించుట (9) ప్రమేహమున సెనగలను బ్రయోగించుట (10) ప్రమేహములలో వెలగబంకను విశేషముగాఁ జేర్చియుండుట. ఇట్టివి ఇంకను ఎన్నియో గలవు. ఇట్లు విషయమును జేర్కొనుచు వచ్చిన గ్రంథవిస్తరమగును గాన నిఁక నొక్క విషయంబును మాత్రము చెప్పి విరమించెదను. శిరస్సంజనితము లగు యూకలకు మనవారు చేయుచుండిన పాదరసప్రవైద్యమును నీ గ్రంథకారుఁడు చెప్పియున్నాఁడు. అయ్యది ఏతద్గ్రంథకర్తయే కనిపెట్టినట్లు తోఁచుచున్నది. ఆ సందర్భఘ గ్రంథభాగ మిది:— శ్లో. పారదం మర్దయే న్నిష్కం కృష్ణ ధత్తూరక ద్రవైః। నాగవల్లీద్రవైర్వాథ వస్త్రఖండం ప్రలేపయేత్। తద్వస్త్రం మస్తకే బద్ధ్వాధార్యం యామత్రయం తతః। యూకాః పతంతి నిశ్చేష్టాః పరీక్ష్యం శాస్త్రసంశయః। విశాలాయాః ఫలం ఫక్వం

తప్తలోహే పరిషిక్తే శుద్ధామోదంతి లగ్న శ్వేతకటాహే శాంబవనం పరమ్. ఈ వల్లభాచార్యుఁ డొక్క భిషక్ఛిఖామణియే కాక సరస కవిశిఖామణి యనియుఁ దెలియుచున్నది. ఈతని కవిత్వ గుంభనల కీ క్రిందిరచనలు సాక్ష్యమీయఁగలుగును:— శ్లో. ఫలత్రయం కటుత్రయం సురదారు ద్విమస్వర। త్రిజాతకం యవాని యుగ్మ వహ్ని జీరకం తథా। రాస్నభార్గివహ్నిచ వ్యాధిఘాతయుగ్మ జీరకం అశ్వగంధ సంయుతం పృథక్సుకర్ష సంయుతం। మధుస్నుహీచ తత్సమా సశర్కరాసమాక్షికం। గోఘృతం సుపక్వకం రసాయనం మనోహరం। మేహపిత్తవాతదుష్ట గుల్మశూలహారకం। సప్తధాతువర్ధనం సుదీపనం యశస్కరం। పూజ్యపాదనిర్మితం రసాయనం సుపూజితమ్॥

బసవరాజీయము:— ఆంధ్రాయుర్వేద గ్రంథములలో "చింతామణి" తరువాత నిదియే యుత్తమగ్రంథము. ఆంధ్రభిషజులలో దీనిని జదువనివా రుండరు. ఈ గ్రంథమునకు రచయిత నీలకంఠ కొట్టూరు బసవరాజు. ఈయనతండ్రి నమశ్శివాయ గురువు. ఆరాధ్య రామశేఖరుడు. స్వనామ గురునామాదులను బట్టికాని ప్రకరణాంతమున నీతడు చేయు ప్రార్థనలఁ బట్టిగాని చూచినచో నీతండు శైవుండని తోచును. అనుకర్త్రనుకార్యులను ఏర్పఱచ వీలు లేదు. కాని యీతఁడు చింతామణిలోని విషయంబుల ననేకము తన గ్రంథమున జేర్చినాఁడందురు. కలౌ బసవకస్మృతిః, కలౌ చింతామణిస్మృతిః వచనములు సంశయము నొదవించుటకు మాత్రమే చాలియున్నవి. ఈయన "కవితాచాతురీ ధురీణుండ" నని వ్రాసికొన్నను కవిత అంత సరసముగా నుండలేదు. కాని "వైద్యజనశిరోభూషణ" యను బిరుదమును జాలవఱకు సార్థకము జేసికొన్నాఁడు. వల్లభాచార్యుని కాలముకంటె నీతని కాలంబున నాంధ్రాయుర్వేదము కొంచె మభివృద్ధి గాంచిన దనవచ్చును. అనేక గ్రంథములం గాంచి అందలి సారంబును గ్రహించి తా నీ గ్రంథమును జేయుచున్నాను అని వ్రాసిన మాట ఉపబలముగాఁ గాబోలును ముద్రితమైన బసవరాజీయములో ఆయా విషయములకు మొదట చరకే మాధవనిదానే అను నీ మున్నగు పదము లుట్టంకితములు. కాని చరకసంహితలో రసగంధకాదియోగములను మాధవనిదానమున చికిత్సావిషయంబులును చెప్పుట యున్నదో విమర్శింపవలయును. ఇప్పుడు లభించు చరకాది గ్రంథములలో లేవు.

వల్లభాచార్యునికంటెను బసవరాజీయమునఁ జేర్చిన గొన్ని నూతనయోగములు:— (1) కర్పూరిని బసవరాజు పురాణజ్వరముల యందు ప్రధానముగా నుపయోగించుట (2) అగ్నిమాంద్యమున విషముష్టిని ప్రయోగించుట (3) ఉబ్బసమున బలురక్కసిని ప్రయోగించుట (4) ప్రమేహమున వేపబంకను ప్రయోగించుట (5) మూలరోగమున అక్కలకర్ర నుపయోగించుట (6) ప్రతిశ్యాయరోగమున నవాసారము నుపయోగించుట (7) యోనిశూలలో మయూరశిఖ ప్రయోగము (8) ఉన్మాద రోగములలో పంది చెవిలోని రక్తముచే నస్యకర్మఁ జేయించుట (9) వ్రణము పగులుటకు నరాస్థిని తైలములేపనము చేయుటతో (10) కోడిగ్రుడ్డునందు రసమును దీసికైచి ఔషధద్రవ్యమునుంచి వాలుకాయంత్రమునఁ బచనముచేయుట. (11) వంధ్యారోగమందు మహాద్రాక్షాదియోగములు (12) వ్యాద్రోగమున గురివెంద విత్తుల నుపయోగించుట (13) పాండురోగమున నల్లఉప్పిచెక్కను విశేషముగాఁ బ్రయోగించుట (14) ఉబ్బసంబున చేఁదుబీఱకవిత్తులను ప్రయోగించుట ఇట్లనేకములు గలవు. వాతరోగములలో వల్లభాచార్యుడు గ్రహింపని యాయుర్వేదసూత్రములను అగ్నికర్మనుఁ దనగ్రంథమున నీయనఁ జేర్చినాఁడు. మొత్తముమీఁద నాంధ్రాయుర్వేదాభివృద్ధి వల్లభాచార్యుని కాలమునందుకంటెను ఈ బసవరాజు కాలమునందు హెచ్చుగా అభివృద్ధి నొందె ననవచ్చును.

భేషజకల్పము:— ఇయ్యది పరిభాషాత్మక గ్రంథము. వరదాచార్యపుత్రుఁ డగు గంగాధరాచార్యునిచే సంగ్రహింపఁబడినది. దీనిని చిలకమర్తి వేంకటాచార్యుఁడు ఆంధ్రమున పద్యరూపముగా నొనర్చినాఁడు. ఈతఁడు శరణ్యపాదాచార్యుని కొమరుఁడు. ఈయన గురువు కందాళ రంగాచార్యుఁడు. ఇం దన్నియో పరిభాషలు గలవు. మాన విషయంబైన మతభేదము లిందుఁ జక్కఁగా విభజింపఁబడి యున్నవి. తత్తత్ప్రక్రియల నుపయోగించు కషాయభేదము లెన్నియో చక్కఁగా వివరింపఁబడినవి.

ఇట్టి గ్రంథ మింతవఱకు వ్రాతసాంప్రదాయములను దోషభూయిష్ఠంబై యున్నది. దీనికి కీ. శే. వైద్యరత్న ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యుల వారు అనేక గ్రంథముల సహాయ్యమున స్వోపజ్ఞ మగు సాంధ్రవ్యాఖ్యానముతో ముద్రించి పుణ్యము గట్టికొని మనలఁ దరింపఁజేసినారు.

ఆంధ్రచింతామణి:— దేవులపల్లి వెంకటనర్సయ్య ఈ గ్రంథమునకు ప్రణేత. శ్రీనివాసమంత్రి ఈయన పితామహుడు. ప్రారంభ పద్యములవలన నద్వైతమతస్థుం డని తెలియుచున్నది. ఆశ్వాసాంత గద్యమువలన ప్రధానముగా వైష్ణవభక్తుఁ డని తేలును. ఈయన వ్రాసికొనిన గద్యను బట్టి వల్లభాచార్య విరచితంబగు వైద్యచింతామణి కిది యొకవిధ మగు ననుకృతి యని స్పష్ట మగును. ఈ భాషాంతరీకరణమును బట్టి చూచినచో గొంత వ్యత్యాసము చూపట్టుచున్నది. లక్ష్యానుసారంబుగ నితడు ప్రథమాశ్వాసంబుననే లోహపాషాణశోధనమారణాదిక్రియలను జెప్పియున్నాఁడు. ఇప్పుడు ముద్రితమైన చింతామణియందు నీ ప్రకరణము కట్టకడను గాన్పించుచున్నది. ఇం దెయ్యది సత్యమో యూహింప వలనుపడలేదు. ఎట్లయినను నితండు పూర్ణంబుగా చింతామణిని భాషాంతరీకరించి నట్లు తోఁచెడిని. కాని పాత్రయంతయు లభించుట లేదు.

శరభరాజీయము:— ఈ గ్రంథమునకుఁ గర్త శివదేవుల శరభరాజు. ఈతని కాలము గాని జన్మస్థలము గాని తెలియఁజేయు సాధారంబులు గానరావు. ఇందు బసవరాజీయము వైద్యచింతామణి మున్నగు వానిలోని యోగములు గానఁబడుటచేత తదనంతర కాలికత్వము మాత్రము సిద్ధించుచున్నది.

# ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్

## అనుమతిబొందిన మూలధనము రూ. 3,00,000.

వాటా. (షేరు) ఒక్కటికి రు. 10 చొప్పున 30 వేల షేర్లుగా విభజింపబడినవి.
ఇదివరకు 15,000 వాటాలకు దరఖాస్తులు వచ్చియున్నవి.
ఏబదివేలరూపాయలకు మించి వసూలై యున్నవి.
పనులు బాగుగా జరుగుచున్నవి. ఆర్డర్లు అపరిమితముగా వచ్చుచున్నవి.
రూ. 1,50,000 ల వాటాలు ప్రస్తుతము అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.
1922 సంవత్సరం జనవరినెల మొదటితేది లోపల మంజూరు చేయబడును.
ప్రాస్పెక్టసు, వాటా దరఖాస్తుఫారములు, వాటాలను కన్వాసుచేయుటకు ఏజన్సీ నిబంధనలు,
మున్నగువాటికి తక్షణమే ఈక్రింది విలాసమునకు వ్రాయవలెను.

ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్



మద్రాసు

ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్ వారిచే నిర్దుష్టముగా తయారుచేయబడిన శాస్త్రీయ ఔషధములు.

ముఖ్య గమనింపు:—ఒక వాటాకు దరఖాస్తులు పంపినను, రిజిష్టరుచేయబడును. ఆయుర్వేదమును వృద్ధిజేయుటకు ప్రోత్సాహము నొసగునట్టివారి కిది మంచిసమయము.

### త్రివృత్ లేహ్యము.

4 అవున్సులు 2 రూపాయి; ఒకపౌను రూ 8 లు.

శ్లో. త్రివృన్మూలం విరేచనే... చరకసంహిత, (కల్పస్థానం)

దీనిని మోతాదుప్రకారము పుచ్చుకొనిన, సుఖవిరేచనమగును. బాలురు, వృద్ధులు, గర్భిణీస్త్రీలు కూడ బుచ్చుకొనదగును. తియ్యగా, రుచిగా నుండును. నిరపాయమైనది. అగ్నిమాంద్యమును బోగొట్టి బలము నిచ్చును.

### స్తన్యవర్ధక చూర్ణము.

4 అవున్సులు రు 0-8-0, 1 పౌను రు 1-8-0.

శ్లో॥ స్తన్యదంస్వృష్యంస్నిగ్ధం...(ద్రవ్యగుణసంగ్రహం)

ఇది చనుబాలులేని తల్లులు పథ్యుక్తముగా బుచ్చుకొనిన మిక్కుటముగా పాలు, చేపవచ్చును. బిడ్డలకు పోతపాలుగాని, మరేవిధమైన ఆహారముగాని ఇచ్చుటకంటె తల్లులీ క్రీమార్లమును సేవించుట మంచిది.

## డాక్టరు ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం. గారిచే స్థాపింపబడిన

ఆంధ్ర ఆయుర్వేద ఫార్మసీ లిమిటెడ్ వారిచే నిర్దుష్టముగా తయారుచేయబడిన శాస్త్రీయ ఔషధములు.

తాళీసాదిచూర్ణము-బిళ్లలు

శేర ప్యాకెట్లు. చూర్ణము 10 తులములు 8 అణాలు

ప్యాకెట్లు 100 ఒకరూపాయ. 1000-కి 7-8-0.

శ్లో. కాసశ్వాస జ్వరహరం ఛర్ద్యతీసార నాశనం। శ్లో

మధ్యాగ్నవహం ప్లీహాగ్రహణీ పాండురోగజిత్. శా॥సంహిత



దగ్గు ఎగయూపిరి జ్వరము జలుబు మొదలగు వ్యాధులయందు మిక్కిలి ఉపయోగము. వాంతులు అజీర్ణ విరేచనములు కట్టును. అరుచిని పోగొట్టిజీర్ణ శక్తిని వృద్ధిచేయును. క్షయ, ప్లీహ పాండురోగములయందుకూడ దీని ఉపయోగము కలదు.

### ఇచ్ఛాభేదివటి

తులము 0-10-0 అణాలు; 10 తులములు రూ 5-0-0

మాత్రలు 100-కి 8 అణాలు; 1000-కి రూ 4.

ఇది సుఖవిరేచనము చేయును. జ్వరములోను కూడ నిచ్చిన విరేచనమై జ్వరము తగ్గును. రాత్రి పరుండబోవునపుడు తీసికొనిన ఉదయమున విరేచన మగును.

### చందనాది వటి.

25 మాత్రలు 1 రూపాయి.

ఈమాత్రలు ప్రమేహము, శర్కర మేహము(పచ్చసెగ), మూత్రకృచ్ఛ్రము, మూత్రవాళము నొప్పిరణము, మూత్రాశయ బలహీనత, స్త్రీలకువచ్చే కుసుమరోగములు, మొదలగుగువ్యాధిరోగములను పోగొట్టును. గణేరియాకు ప్రశస్తమైన మందు.

### అశ్వగంధావలేహ్యము.

4 అవున్సులు 1 రూపాయి; ఒకపౌను రూ. 3

శ్లో. క్షతక్షీణేచ దేహే చ వికేవ బలవర్ధనం...శసా॥

ఇది క్షీణించిన శరీరము గలవారలకు బలము, పుష్టి, జఠరదీప్తిని గలిగించును. మరియు నవీనముగా వచ్చినది, లేక చిరకాలము నుంచి యున్న ఫిరంగిరోగమును బాగుచేయును.

వాతరోగము, అమవాతనొప్పులు, కీళ్లవాట్లను పోగొట్టి నరములకు బలముచేయును. ధాతువృద్ధిని గలిగించును. మేధాజనకము.

### దంతధావన చూర్ణము.

అవున్సు 0-4-0; 2 అవున్సులు 0-7-0.

దీనితో పళ్లు తోముకొనిన, శుచిగాను, దుర్గంధ రహితముగా నుండును. ఇది స్వాదుగాను కటు, కషాయరస ప్రధానముగాను ఉండును. పళ్లవెంబడిని చీము, రక్తముపడుట, పళ్లు కదలుట, మాటిమాటికి చిగుళ్లు ఉబ్బుట మొదలగు దంతరోగములను పోగొట్టును. నోటిపూతకు గండూషముగా కూడ నుపయోగి పడగును.

### వాసావలేహ్యము.

(బసవ, కఫరోగాది హరము)

"...శ్వసనేచకాసేక్షయే ప్రపిత్తేకఫపీనసేచ......"

ఈ లేహ్యము దగ్గు, ఎగశ్వాస, ఉబ్బసము, నోటివెంట రక్తముపడుట, క్షయ మొదలగు వ్యాధులయందు మిక్కిలి ఉపయోగపడును. 4 అవున్సులు రూ 1-4-0; 1 పౌను రూ 4.

వాసాచూర్ణము: ఈ చూర్ణమును నిప్పుమీద వేసి పొగను పీల్చినయెడల శ్వాసము, ఎగ ఊపిరి వెంటనే తగ్గును. రోగికి ఆయాసము హెచ్చుగ ఉండునపుడు పై వాసావలేహమును లోపలికిచ్చుచు ఈచూర్ణముతో ధూమపానముచేయించుట హితము.

వెల 1 అవున్సు రూ 0-12-0.

పోస్టుబాక్సు 369. ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్, 19 హారిస్‌రోడ్డు, మౌంటురోడ్డు-మద్రాసు.

రసప్రదీపిక:— ఇయ్యది మూఁడాశ్వాసముల గ్రంథము. దీనిని ముసునూరి వేంకటాచార్యుడు సంస్కృతమునుండి యాంధ్రమున పద్యరూపముగా నొనర్చినారు. కీ. శే. వీరేశలింగముపంతులు గారు కవిచరిత్రమున నీతడు నూఱువర్షముల లోఁబడినవాఁడనియు గోదావరి మండలవాసి యనియును వ్రాసినారు. రసప్రదీపిక యాంధ్రభాషలోని రాసాయనిక గ్రంథములలో తొలుదొల్తది. ఇందు ధాతు లోహ మారణాది విషయంబు లన్నియు వర్ణింపఁబడి యున్నవి. ప్రాచీన రసతంత్ర ప్రవర్తకులు పారదము రసరసేంద్ర సూత, పారద, మిశ్రక భేదములచే నైదు విధము లనియు నందు రస రసేంద్రములు బుట్టినపిదప సులు దేవనాగులు పూడ్చి రనియు దానంజేసి యయ్యవి దుర్లభంబు లనియు మిగిలిన సూత మిశ్ర పారదంబులు లభ్యంబు లనియు వ్రాసియుండఁగా నీ కవి తనకాలమునకు ఆమూటిలో గూడ రెండు దుర్లభంబు లగుటవలన పారదము మాత్రమే లభ్య మగు నన్నాఁడు. ఈ రసప్రదీపికను కీ. శే. గోపాలాచార్యులుగారు ప్రభ యను వ్యాఖ్యానము తెలుగున వ్రాసి ప్రకటించినారు. ఈ రసప్రదీపికయు నీవ్యాఖ్యానమును నాంధ్రదేశమందలి రాసాయనిక గ్రంథదారిద్ర్యమును తొలగించిన వనియే చెప్పవచ్చును.

సర్వార్థసిద్ధప్రదీపిక:— గ్రంథకర్త ఇర్లపాటి పేరయామాత్యుఁడు. వైద్యసార మని గూడ దీనికి మఱొక నామము గలదు. ఇయ్యది యసంపూర్ణ మగుటచే గ్రంథము నంతగా విమర్శింప వీలు లేదు.

ఈ విషయమును గూర్చి యంతగా విమర్శింప నవసరము లేదు. ఈ గ్రంథములలో చాలభాగము ముద్రితంబులై మనకు దొరకుచునే యున్నవి. కావున ముద్రణలో లేక యాంధ్రవ్యాఖ్యతో గూడియున్న యొకటి రెండు గ్రంథములను మాత్రము వివరించెదను.

గదాసంజీవనము:— ఇది సంస్కృతంబున శ్రీవత్సగోత్రుండును ఆపస్తంబసూత్రుండు నగు మాధవపండితునిచే రచింపఁబడినది. ఈతనికి వైద్యవిద్యాత్రినేత్ర యను బిరుదమున్నది. ఈ గ్రంథమునకు యాంధ్రటీక నెవ్వ రెప్పుడు రచించిరో తెలియదు. ఇందు రోగ నిదానంబులు లక్షణంబులు తచ్చికిత్సలును చక్కగా వివరింపఁబడినవి. కాని ఇయ్యది యసంపూర్ణముగా లభించుటచే నంతగా విమర్శింప వీలుపడుటలేదు. శైలిలోక శ్లోకము:—

శ్లో. కుండలీపత్రమరిచం శృంగిశృంగంచ నాగరమ్
లశునం భృంగరాజశ్చ క్వాథోయం సర్వశూలజిత్.

పాఠము:— ఇందలి "గౌరీపుత్రకార్తికేయ విరచితే పాపాట గ్రంథేవి దానగణ రోగో నామ ప్రథమః పరిచ్ఛేదః." అను గద్యమును పరిశీలించినచో నష్టాంగహృదయము కాక ఇదియొక నూతనగ్రంథమని స్ఫురించుచున్నది. కాని నిజముగా దీని నెవ్వరు రచించిరో తెలియరాదు. యిందు చరక వాగ్భటాదులలోని నిదానంబులు చికిత్సలు నానుపూర్విగ గలవు. ఇయ్యది రెండు పరిచ్ఛేదములు మాత్రము లభించుచున్నది. ఇవిగాక మద్రాసులో నివసించిన పువ్వాడవారు ఈక్రింది గ్రంథములకు చక్కని టీకలను వ్రాసి ప్రకటించినారు:— (1) అష్టాంగహృదయము (2) అనుపానతత్త్వాకరము (3) కాలవిజ్ఞానము (4) గుణపాఠము (5) ఘృతతరంగము (6) చికిత్సారత్నము (7) చికిత్సాసారము, (8) ధన్వంతరినిఘంటువు. (9) నాడీనక్షత్రమాల (10) నాడీజ్ఞానము (11) నాడీకరణకల్పద్రుమము (12) శార్ఙ్గధరసంహిత (13) సర్వౌషధిగుణకల్పము (14) సుశ్రుతశారీరము (15) వైద్యామృతము (16) సద్వైద్యజీవనము. (17) అనుపానమంజరి. ఇట్టులనే మొన్నమొన్న కీర్తిశేషులైన పండిత గోపాలాచార్యుల వారును ఈక్రింది గ్రంథములను చక్కని వ్యాఖ్యానములతో ముద్రించి ఆంధ్రదేశసేవఁ జేసి మనలఁ దరింపఁ జేసినారు. (1) మాధవనిదానము (2) అర్కప్రకాశము (3) ఆయుర్వేదపరిభాష (4) పథ్యాపథ్యము. ఇవి గాక శ్రీ ఆచార్యులవారు టీకలు వ్రాసిన పెక్కు గ్రంథము లున్నవి. ఈ వ్రాసిన దానింబట్టి మన యాంధ్రదేశమునఁ గొంతవఱకు గల ఆయుర్వేదగ్రంథముల స్థితి తెలిసినది. ఇంకను నధికముగా గ్రంథము లుండినవని చెప్పవలసియున్నది. కాని అట్టివి తెలుపఁబడకుండుట నిజముగా మన యాలస్యమునకు ఫలమనక తప్పదు. ఇప్పటి మన స్థితిగతు లెంత నీచముగా నున్నను పూర్వులగు మన యాంధ్రులు ఆయుర్వేదమున మిగుల పరిశ్రమచేసి సుచికిత్సకులై గౌరవపాత్రులై రని అనితల్లి శాసనమే వేయినోళ్ల చాటుచున్నది. మఱియు నిప్పుడు గూడ గ్వాలియర్ బరోడా కోటా దర్భంగ కొచ్చి మైసూరు మొదలగు సంస్థానాధీశు లిదివఱకే యాయుర్వేదమునకుఁ బ్రోత్సాహ మొసఁగుచున్నారు. కొందఱు మునిసిపల్ సంఘముల వారును తాలూకాబోర్డు జిల్లాబోర్డులవారును యాయుర్వేదముపట్ల నభిమానముఁ జూపుచున్నారు. ఇట్లే మనయాంధ్రదేశములోని సంస్థానాధీశులును శ్రీమంతులును రాజ్యతంత్రాధికారులును ఈ యాయుర్వేదమునకు చేయూత నొసంగినచో ఆంధ్రభాషాదేవికి అమూల్యాభరణము లనఁదగిన గ్రంథకర్తలను బయలు వెడలఁ గల్గుదురు. దాన మనకు చిరత రాయురారోగ్యభాగ్యములు చేకూరి సమృద్ధులు నిండారగలవు. కావున సర్వేశ్వరుఁడు మనయాంధ్రదేశమున కిట్టి భాగ్యమును ప్రసాదించును గాక.

# లోకయాత్ర

మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారు

లోకము భిన్నభావము విలుప్తము బుద్ధియు, బల్మికల్మి, దు
ర్బుద్ధులు మాయలందుఁ గడతేఱిన స్వాములు పెక్కుమంది, సు
శ్లోకులు ధర్మతత్పరులుఁ జూడఁగఁ దక్కువ. ఏమిచారి? యీ
పా! కలికాలసాధు లవహాస్యతపా లగుచుండి రెంతయున్.

ఉ. తోఁచును మంచి చెడ్డలై, తోఁచును చెడ్డయు మంచియౌచు, నా
లోచన లెన్నగా నలిపి లోకహితంబగు దాని కట్టులో
యాచరణంబునం దిడుట యందరికిన్ విధి, స్వీయపక్షమున్
జూచిన లాభమొందెడి వసూయను వీడుట శ్రేయ మెంతయున్.

చ. ఒకరి సుఖంబునన్ సుఖమె? యొక్కరి దుఃఖము దుఃఖమే? జగ
మ్మొక్కటిగానెన్ సుఖించుగతి యోజనచేసెడి బుద్ధిమంతు లె
న్నికగను గాల మిట్టిది. యనింద్యచరిత్రులె రాజులెల్ల. నిం
దకుఁ దగు కర్షముల్ సలుప దార్ఢ్యన రెన్నను భూమిపాలకుల్.

మ. మన కుకీర్తి మెలంగినన్ జగము సమ్మానించున్ బ్రకృతిల్లు. స
జ్జనుఁ డేవేళ బరోపకారపరుఁడై సన్మాన్యుఁడై యొప్పు. దు
ర్జనుఁడే వో యపకారముల్ సలిపి సర్వద్వేషియౌ. లోకరం
జనుఁ డెవ్వండో యతండె రాజగును. రాజద్వేషి కీడందెడిన్.

శా. ఎంచం జెల్లదు దోషులందు నొకలన్, హేయంబుగా జేసి వ
ర్జించం జెల్లు, బరోపకారులను దూషించంగ రాదెప్డు సా
ధించం గూడదు సాధుమానవుల యత్నించంగ నాకీర్తికిం
గించిత్తేని వివేక మున్న నరుఁడేన్ గీడొందఁగా నెంచకన్.

శా. దానం బిద్ది యనూన మిట్టిది మహాంభోవారణం బిద్ది ని
త్యానందం బిది పుణ్య మిట్టిది యటంచావంత యోజింపవా
డే జ్ఞానేమి యొనర్చునన్ జగతిలో నింతేని మేల్ కాద్యజ్
ఞానంబు న్విడి చేసినట్టి పని ప్రాజ్ఞశ్లాఘ్య మెట్లయ్యెడిన్?

చ. ఎవరికి నేది యిష్టమొ యదే శుభదంబగు వారి కెప్డు. శాం
భవ మని శాక్తమంచు మరి వైష్ణవమంచును సౌరమంచుఁ గ్రై
స్తవ మని కోరకం దనియు ధాత్రిఁ గట్టి మతమ్ము లెల్ల వం
చితము. యుపాసకప్రకృతి చెడ్డదియే నది చెడ్డదయ్యెడిన్.

సీ. కామధేనువుఁ గొన్న కార్తవీర్యునిఁ దండ్రి
గూర్చినయతని గొడ్డుకలను దున్మి
అవనిఁ బరశురాముఁ డక్షత్రియను జేసి
ధాత్రీసురుల కది దారవోసె
మును కశ్యపుని దిది యను వినయము బోధ
పడు కార్యవీరుఁడుఁ గనిన
బ్రాహ్మంబు కన్న క్షాత్రంబు బాగ మగు తేజ
మని తెల్పెఁ గుశికనందనమహర్షి.

తే. యిప్పటికిఁ బ్రభువులు బ్రాహ్మణేతరులకు
గౌరవము గూర్పఁగఁ దగుట కరము బ్రాహ్మ
ణుఁ డని తెల్పునట్టిది యొట్టు లడుగు
పట్టఁబట్టరు పట్టి దెప్పుటకి నిజము.

తే. అప్పుడారీతి బ్రాహ్మణు లవనిపులయి
దాని క్షత్రియులకు నిడి తపముఁ బూని
మంత్రులయి కీర్తిఁ గని కలిమహితు సేవ
కత్వమునకును దగకుండ్రి, కడకు నకట.

తే. కలిమహితు నిప్పు డెంతగాఁ గానిపించ
కున్న నింతయో యెంతయో యున్న దిపుడు
బ్రాహ్మణులకు నప్పార్థపర ప్రవృత్తి
దాని విడకున్న వారి కెంతేని మేలు.

సీ. వృత్రాసురుని జంపఁ జేడిన మఘవ సాగరముఁ
ద్రావెడి మున్నగస్త్యమౌని
మును దధీచియనెడి ముని యూఁడె తన
యెముక లర్థులై వచ్చిన యనిమిషులకు
దనకడ కరుదెంచు తపసులఁ బ్రోది గోదా
వరిన్ జేడె గౌతమ మహర్షి
ఇక నెంద అందఱో బుధు లుపకారముల్
చేసి లోకములఁ బ్రసిద్ధిఁ గనరె.

తే. అట్లె జగదుపకారమ్ము నాచరించి
బ్రాహ్మణులజాలు లీపు గౌరవంబు నిల్పు
కొనఁగవలె. వారి ద్వేషింపఁగూడ దెవరు
బ్రాహ్మణద్వేషమున జేగి చద్వంత్రు.

తే. మొఱటినుండియు నన్యుల మోసపుచ్చి
యుణఁగఁ ద్రొక్కిరి బ్రాహ్మణు లనుచు గొంద
ఱంత్రు నాతు రెవ్వరో వారి నఖిలమునలు
గౌరవించుటఁ గనరో యావ్వార లెపుడు.

తే. అతఁడు మునులకు నడిచిన యవియె కదబు
రాణములు నేఁటికిని వాని బ్రాహ్మణులని
రాకరించిరే? యోగ్యులుగాక యొకరు
గౌరవముఁ గొంద జాలరు గా ధరిత్రి.

తే. ఎవరి దేజాతి యేఁ గాని, యేమతంబు
గాని, యన్యోన్యరాగంబు గలిగి మెలఁగ
వలయు, నట్లైన శుభములు గలిగి తీఱు
గావలెనికిఁ గూడదు కలహపడుట.

తే. అరయ నాచారముల కప్పుడెపుడు మార్పు
లగుపడెడి మున్న యిప్పుడు నప్పగిసని
జేసికొన నగు వచ్చెడి నేగిమేలు
లందు నెయ్యది యధికంబొ? యరయ వలయు.

# ఆయుర్వేదము — ఆంధ్రుల కర్తవ్యము

ఆచంట లక్ష్మీపతి గారు, బి. ఏ. ఎం. బి. సి. ఎమ్.

ఆంధ్రరత్నమనఁ దగిన వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగారు మన దురదృష్టమున కాలధర్మము నొందుట సంభవించినది. ఆచార్యులవారు కేవలమును మన ఆంధ్రదేశమునందొక్కచోట మాత్రమే గాక భరతఖండమునం దంతటను విఖ్యాతిగాంచిన వారు. వా రున్నంతకాలము మరెవ్వరి సాయము నక్కఱలేకయే ప్రజాహితకరము లగు నాయుర్వేద కార్యము లన్నియును అవలీలగా నెఱవేర్చుచుండెను. వారు లేనిలోప మిప్పుడు స్పష్టముగ దా తెలియుచున్నది. మాటలకేమి గాని- సంవత్సరమునకు పదివేల రూపాయలకు మించిన వ్యయమును భరించి, భరతఖండమున కంతటికిని ఆదర్శ మనఁదగినట్టి ఒకకళాశాలను ఆయుర్వేద ధర్మవైద్యాలయమును 10,15 సంవత్సరములు తామొక్కరే నిర్వహించుటకు ఎంతటి ప్రజ్ఞా ప్రాభవములు కావలయునో ఆలోచింపుడు.

ప్రస్తుతము ఆయుర్వేదపు స్థితి సందిగ్ధావస్థలో నున్నది. ఇంతవఱకును ప్రభుత్వమువారును, వారి వైద్యశాఖాధికారులును ఆయుర్వేదమునకు తాము ప్రతికూలు రనుటను బాహాటముగ వ్యక్తపఱచుచుండిరి. ఆయుర్వేదము పట్ల తామున్నంతకాలమును ఎట్టి సానుభూతిని జూపమని శాసనసభలో నిదివఱకు వైముఖ్యమును జూపిన వర్గములవారలు గిప్పుడ్స్గారే గడచిన ఫిబ్రవరిలో నూతనశాసన నిర్మాణసభలో ప్రజాప్రతినిధుల మనుకొను వారిబలము హెచ్చుటచేత పరాజయము వహింపవలసివచ్చినది. తరువాత "ఆయుర్వేదాభివృద్ధికై తలయు కార్యములను నిర్వహించుటకు ప్రభుత్వమువారు వెంటనే పూనుకొనవలయు"నను ఏ. ఎస్. కృష్ణారావుగారి తీర్మానము అంగీకృతమైనది. తదనుసారముగ నాయుర్వేద ప్రాశస్త్యమును పరీక్షించుటకై ప్రభుత్వమువారు కమిటీని ఏర్పరచిరి. ఫలితము ముందు విశదమగును.

**డాక్టరు కోమనుగారి రిపోర్టు**

ఇది ఇట్లుండగా, ప్రభుత్వమువారు, 1918 అగస్టులో ఆయుర్వేదౌషధములలో నుపయోగకరము లగునవి ఏవియైన నున్నవేమో పరిశోధించుటకు డాక్టరు కోమను గారిని నియమించిరి. కోమను గారిని నియమించునప్పుడు శాసనసభ్యులు వీరి నియామకము "ఆయుర్వేదాభివృద్ధి కా? లేక, ఆంగ్లవైద్యాభివృద్ధి కా?" యని ప్రశ్నింపగా, ఆయుర్వేదము అశాస్త్రీయ మనియును, కోమను గారి నియామకము ఆయుర్వేదములోగల ప్రశస్తౌషధములను ఎఱుంగుటకే యనియును చెప్పిన ప్రభుత్వమువారి ప్రత్యుత్తరమును బట్టియే ఫలితముగూడ నూహింప వచ్చును.

డాక్టరు కోమనుగారి రిపోర్టు ఇప్పుడు బయలు వెడలినది. కోమనుగారి విషయమున నాకు పరిపూర్ణమగు విశ్వాసము కలదు. ఆయన ఆయుర్వేదము నెఱుఁగని వాఁడే యయ్యును ఆయుర్వేదాభిమాని యనఁదగినవాడు. తాము ఆయుర్వేదౌషధములను పరీక్షించితిమనియును, అందు ముప్పాతికమూడువాళ్లు ఉపయోగకరములును సులభ్యములును నగా నున్నవనియును వారు వ్రాసినారు. కాని మనకు వీరి రిపోర్టును చదువకముందే ఈవిషయములు తెలిసియున్నవి. కాని తొలుత ప్రకటనకు గడంగిన వీరికేమిని ప్రభుత్వాధికార వాసనావశమునఁ గాబోలు-ఆయుర్వేదము శాస్త్రీయ పద్ధతులకు దూరమనియును, ఇదు తాము తెలిసికొనుటకు ఏప్రాతిపత్తియు కాని, బ్రిటీషు ఫార్మకోపియా మందులకంటె నిందు పరిగణింపఁ దగిన విశేషగుణములు లేవనియును ఆయుర్వేదౌషధములకంటెను ఆంగ్లేయౌషధములే సర్వసాధారణముగ నుపయోగింపఁదగినంతటి చౌకగా నున్నవనియును ఆయుర్వేదౌషధశాలలకంటె ఆంగ్లేయౌషధశాలలే సులభసాధ్యము లనియును సీమున్నగు వాక్యరత్నములతో రిపోర్టు పర్యవసానమును నింపెను. కాని ఆరిపోర్టును పరికించినచో, మనకు వారు పరీక్షించిన ఔషధగుణ దర్పము బట్టి వారి యనుభవ మెంతటిదియనియును, వారు పర్యాటకు లిచ్చు పలుపో పన్యత సాన మింకొకటి యనియును తోఁచక పోదు. వీరు 225 మందులను పరీక్షించి అందులో నూటికి 75 వంతు నుపయుక్తములని వ్రాసియును పర్యవసానము నిట్లు వ్రాసిరి.

వీరు పరీక్షించి మందులనుగుఱించి తెలిపిన అనుభవవా[క్యము]లను పర్యాలోచించినచో ఆయుర్వేదౌషధములే ఆంగ్లే[యౌషధ]ముల కన్న సులభములును నిశ్చయముగ గుణదాయకము[లు]ను [illegible] తేలుచున్నది. అట్లు కాదేని వీరు తమ రిపోర్టులో ఆయు[ర్వేదౌ]షధములవలన దుశ్చికిత్స్యమై ఆంగ్లేయౌషధములవలన [సు]చికిత్స్యము అగు నొక్క వ్యాధినైనను చెప్పఁగలిగియుండిరా? వైద్యశాలనిది చలిజ్వరము దుర్నివార మను సాంగ్లసిద్ధాంతము కోమను గారి రిపోర్టు వలన వృథాపాత్రమైనది. మలేరియా జ్వర పురుగును కనిపెట్టి ఆవ్యాధిని మన ఆయుర్వేదీయౌషధములగు ఆనందభైరవి శీతాంశురసము పంచతిక్తకషాయము మున్నగువాని ప్రయోగములచే నిర్మూలము చేయఁగలిగితి మని వీరు వ్రాసిన యొక్కయంశమే ఆయుర్వేద విజయమునకు ప్రధానమగు నిదర్శనము కాదా? ఇంకయేల? చరకమహర్షి నాటినుండి నేటివఱకు మన కమూల్యము ననుభవసిద్ధములై ఆచరణలో నున్న ఔషధముల వలననే ఈ విషయము స్పష్టమగుచున్నది.

ఆయుర్వేదగ్రంథములు వ్యాధిపరీక్షణముఁ జేసి స్పష్టముగా సాధ్యాసాధ్య కష్టసాధ్యములను నిర్ణయించి ప్రదర్శించినవి. వీనిలో అసాధ్యము లని పేర్కొనిన ఏయొక్క వ్యాధినైనను - కుదుర్పఁగల ఆంగ్లేయౌషధమును-తాము చెప్పఁగలరా? యని కోమను గారి నడిగెదను. బ్రిటిషు ఫార్మకోపియాలో లేని-ఆయుర్వేదమునఁగల-విశేషౌషధము లేవైన గలవా? యని వీరు ప్రశ్నించిరి కాని, ఈ ప్రశ్నమునకే- ఆయుర్వేదమునం దసాధ్యములని పేర్కొన్న వ్యాధుల విషయములో ఆయుర్వేదము-ఆంగ్లదేశపు ఫార్మకోపియానుండి గ్రహింపవలసిన యౌషధము లేవైన నున్నవా?-అని ప్రతిప్రశ్నముఁ జేసినచో తరేమి ప్రత్యుత్తరము నిచ్చెదరో? ఈమాటలు నేను స్వాభిమానముతో ననుటలేదు. మన ఆయుర్వేదములో లేనివానిని - గుణదాయకములైన వానిని-మన ఆయుర్వేదగ్రంథములు దురభిమానముఁ జూపక మహోదారమతితో ప్రతికాలమునను పరిగ్రహించుచునే యున్నవి. నల్లమందు రేవలచిన్ని మొదలగునవి ఇట్టివే. బసవరాజీయమున్నగు పూర్వాంధ్రాయుర్వేద పండితులును-ఆయుర్వేద గ్రంథకర్తలును-ఇట్టి యనుభూతప్రక్రియలను తమతమ గ్రంథములలో జేర్చియేయున్నారు. ఇట్టివారి పరిశ్రమల ముందఱ కోమనుగారివంటి ఆంగ్లవైద్యులపరిశ్రమ లేపాటివో వ్రాయవలయునా?

కొంతకాలముక్రిందట మనదేశము "పాలకుల వేషభావము లన్నియుకుదని గౌరవప్రదము" అన్న వ్యామోహమున మునిఁగియున్నది. కాని కాలచక్రము పరివర్తితమగుటచే నాపోఁకడ ప్రస్తుతము వెనుకటి పథకమును వదలిపెట్టి స్వదేశ స్వభాషాదులు గౌరవ

ప్రదములని ప్రజలు పొగడ నారంభించినారు. కాని ఇందును లోపములేక పోలేదు. కేవలము అభిమానముతో గాక స్వాస్థ్యవాపా వ్రతములను మంచిచెడ్డలను తెల్పగలజ్ఞానము ఏజాతివారి నుండినను పరిగ్రహింపవలసినదే. మనము మన ఆయుర్వేదగ్రంథములను వైద్యప్రచారమును చక్కగా పరిశీలించి, కలసినచో సంస్కరించికొని వృద్ధికి రావలసియున్నది. కనుక ప్రకృతము ఆయుర్వేదాభివృద్ధికై చేయవలసినవి భావములను చర్చించి ఏర్పాటు కావలయును



ఫార్మసీవారి ఔషధనిర్మాణశాల

ఇందులకు విస్తారముగా గావున్నను కొన్నింటినైనను ఆయాపట్టణములలో ఆయుర్వేదమును ప్రచారము గావింప కళాశాలలును ఔషధాలయములును ఏర్పాటు కావలయును. ప్రజలును దేవస్థానాది ధర్మవిచారణకర్తలును ఇందులకు తోడ్పడి నూతనప్రతిష్ఠాపనములలో సమగ్రాయుర్వేదగ్రంథపఠనము మాత్రమే గాక, నవీనములగు శారీరశాస్త్రాదులును చేర్పు ఏర్పాటు చేయవలయును.

**ఆయుర్వేద పరీక్షలు**

ఏదేశమునందైనను సరియే మంచితోబాటు చెడ్డయును అనుసృతముగ నుండును. ఇట్లే మనదేశమునందును వైద్యులవిషయమునను గలదు. ఇట్టి లోపమును పోగొట్టి నిజముగు సుశిక్షితవ్యయును తెలకొల్పునవి పరీక్షలు. నిఖిలభారతీయాయుర్వేదవిద్యాపీఠము వారు ఇప్పటికి 10, 15 సంవత్సరములనుండియును వివిధదేశములలో వార్షికపరీక్షల నేర్పాటుచేసి సుశిక్షితులని విద్యాపీఠము నిర్ణయించిన సద్వైద్యులకు బిరుదముల నిచ్చి సత్కరించుచున్నారు. ఇప్పుడీ పరీక్షలు మన ఆంధ్రభాషలో గూడ బెజవాడ మున్నగు స్థలములలో జరుగుట కేర్పాటులుజరిగినవి. విజ్ఞానఘనులగు వైద్యులు, తమతమ శిష్యులను ఆ పరీక్షలకై పంపి, దేశమున ఆయుర్వేదవైద్యులకు వర్ధమగు స్థానము లభించునట్లు ఏర్పఱుపవలసి యున్నారు.



ఫార్మసీవారి ఓషధుల తోట

**ఔషధములు**

పూర్వము మన దేశమునందు రాజులే స్వకీయద్రవ్యమును వ్యయపఱచి, అమూల్యములగు ఔషధములను చేయించి, తమ యుపయోగమునకు పోగా మిగిలిన వానిని ప్రజల రోగోపయోగమునకై వినియోగించుచుండెడివారు. కాని ప్రస్తుతము ఆ పద్ధతులు పోయి విదేశీయవైద్యులు-విదేశీయౌషధములు-పాలకుల యభిరుచిని ననుసరించి ప్రబలము చెందుటచేత, దేశీయవైద్యులును దేశీయౌషధములును మూలబడినవి. పైగా ఇట్టిస్థితిలో దేశీయవైద్యులు పూర్వపు ఉన్నతిని దెచ్చుటకై మనము లక్షలకొలది సొమ్ము వ్యయముచేయవలయును. మనదేశపు జనుల కందఱకును సరిపోవునంతటి యౌషధములను ఓషధులను మనము నిరివిగ లభింపజేసినంగాని ప్రస్తుత మీయవనతి తొలగదు. ఇట్టి ఏర్పాటులను గావించుటకు మనము వర్తకసంఘముగా నేర్పడి పనిచేయుట భాగ్యము. ఈ యుద్దేశముతోనే నేను ఒక జాయింటు స్టాకు కంపెనీని ఏర్పాటుచేసి ఆంధ్రాయుర్వేదఫార్మసీ అను పేరుతో నడపుచున్నాను. ఆంధ్రులనేకులు నాకు తోడ్పడినారు. గడచిన జనవరి 17 వ తేదిని ఈఫార్మసీకి పిట్టి త్యాగరాయశ్రేష్ఠిగారి అధ్యక్షతను ప్రారంభోత్సవము జరిగినది. ఆంధ్రదేశీయుల పరిపూర్ణమగు తోడ్పాటుతో ఈ యుద్యమమును నిర్వహింప నున్నాను. ఈగొప్పయత్నము సఫలమై ఆంధ్రదేశమునకు కీర్తిని దెచ్చునట్లు దేశీయులును దైవమును అనుగ్రహము జూపవలసి యున్నది.

# ఆయుర్వేద రసాయనశాస్త్రముల పరస్పర సంబంధము

వేమూరు విశ్వనాథశర్మ గారు; యం. ఏ. ఎల్. టి.

ప్రకృతిశాస్త్రములలో ఆయుర్వేదమునకును రసాయనశాస్త్రమునకును పరస్పరమైత్రి చాల గలదు. ప్రతిదేశమునందును రసాయనశాస్త్రాభివృద్ధికి ముఖ్యముగ వైద్యులును రసవాదులును కారకులు. రసవాదులనగా నీచధాతువులను వెండి బంగారములుగ మార్చుటకు ప్రయత్నించెడివారు. మనదేశములో కూడ ఈ రెండు శాస్త్రములును చిరకాలము క్రిందటనే యభివృద్ధి చెందినవి.

రసవాదుల యోగములు చాలవరకు గోప్యముగ నుండుటచేత వారి రసాయనశాస్త్రసిద్ధాంతముల నెంతవరకు అనుసరించుచుండిరో చెప్పుటకు వీలు లేదు. కాని వైద్యశాస్త్రయోగములను రసాయనశాస్త్ర సిద్ధాంతముల బట్టి పరీక్షింపవచ్చును. మొదట మన దేశములో మందులను కేవలము ఓషధులతో చేసెడివారు. కాని కాలక్రమమున రసవిషగంధకాదు లగు ఖనిజములను కూడ ఆయుర్వేద వైద్యులు శుద్ధిచేసి లోపలికి వాడుట ప్రారంభించిరి. నాటినుండియు వైద్యశాస్త్రయోగములు రసాయనశాస్త్ర సంబద్ధములై యీ రెండిటికి పరస్పరసంబంధము గాఢము అయ్యెను.

వస్తుతత్వమును నిరూపించునది రసాయనశాస్త్రము. వస్తువుల యొక్క గుణావగుణములను కనిపెట్టి లోపలికి పుచ్చుకొనునప్పుడవి శరీరమునందెట్టి పరిణామములు పుట్టించునో తెలుపునది వైద్యశాస్త్రము. వస్తుసంఘట్టనము వైద్యశాస్త్రమునకు అవసరముగనుకను, ఈ సంఘట్టనము రసాయనశాస్త్ర సిద్ధాంతములకు బద్ధమై యుండుటచేతను ఆయుర్వేదవైద్యులకు రసాయనశాస్త్రపరిచయము అవసరము.

పాశ్చాత్యులలో కాలక్రమమున రసాయనశాస్త్రము ప్రత్యేకముగ స్వతంత్రశాస్త్రముగ నభివృద్ధి చెంది వైద్యశాస్త్రమునకు తోడ్పడుచున్నది. కాని మనదేశములో కొంతకాలము గడచిన తరువాత అన్ని శాస్త్రములవలెనే వైద్యశాస్త్రముకూడ క్షీణించి రసాయనశాస్త్రాభివృద్ధికి గూడ నిరోధము కలిగెను. ఈ కారణముచేత మనదేశములో రసాయనశాస్త్రము స్వతంత్రశాస్త్రముగ బరిణమించుటకే యవకాశము లేకపోయెను. కాని పాశ్చాత్యవైద్యులలో ప్రతివానికిని రసాయనశాస్త్రముఖ్యసిద్ధాంతములు హస్తామలకముగ నుండును. మన ఆయుర్వేదవైద్యుల కట్టి శాస్త్రపరిచయమే లేదు. కావున రసాయనశాస్త్ర సిద్ధాంతములను కొన్నిటి నీవ్యాసమునందు తెలిపెదను.

నేటి ఔషధముల తరువాత లోహాదులను భస్మముచేయుట ఆయుర్వేదములో ముఖ్యయోగము. ఇవి సామాన్యముగ పుటములు వేసి తయారుచేయుదురు. ఈ భస్మములు ముఖ్యముగ ప్రాణవాయువుతో గూడుకొనినవో, లేక గంధక సంబంధమైనవిగనో, యుండును, భస్మీకరణములో ఆయుర్వేదవైద్యులలో కొన్ని శాస్త్రవిరుద్ధము లగు అభిప్రాయము లున్నవి. రసమును గంధకముతో గలిపిభస్మము చేయునప్పుడు ఒకపాలురసముతో నొకటి మొదలు ఆరుపాళ్ల వరకు గంధకము నూరి, దానిని గాజుబుడ్డిలో వైచి, వాలుకా యంత్రముతో వండుదురు. ఇట్లు వండినప్పుడు రసము సిందూరించి గాజుబుడ్డియొక్క పైభాగమున అంటుకొనియుండును. ఇట్లు తయారైన సిందూరము గంధకపు పాళ్లను బట్టి ఆరువిధము లగు సిందూరములను వండవచ్చునని ఆయుర్వేద వైద్యుల యభిప్రాయము. రసముతో సరిసరి గంధకమును గలిపి వండిన సిందూర మేకగుణమనియు, ఆఱురెట్లు గంధకముతో వండిన షడ్గుణమను సిందూరము మఱియొకటనియు వారి యభిప్రాయము. కాని యిది శాస్త్రసమ్మతమైనది కాదు. వస్తుసంయోగమునందు పరిమాణనియమ మున్నది. అనగా రసము గంధకముతో కూడి సిందూరించునప్పుడు తులము రసమునకు అందులో ఆరవ వంతు గంధకము కలిపి నూరిన చాలును. పాతిక తులము రసముతో సిందూరించుటకు నాలుగు తులముల గంధకము చాలును. ఇంతకంటె నెక్కువగంధకము కలిపినయెడల నాలుగు తులములు మాత్రమే రసముతో గలిసి మిగిలినదంతయు ఆవిరిరూపమున నెగిరిపోవును. సిందూరము వండునప్పుడే యావిరిరూపమున నెగిరిపోయిన గంధకము గాజుబుడ్డియొక్క మూతిచివర నుండుచుండును. పాతికతులము రసముతో నాలుగుతులములకంటె తక్కువ గంధకము కలిపినయెడల కొంతరసము సిందూరించక మిగిలిపోవును. ఇట్లు మిగిలియుండిన రసము ఆవిరిరూపమున కొంతయెగిరిపోవును. మఱికొంత గాజుబుడ్డియొక్క పైభాగమున అంటుకొని సిందూరముతో కలిసియుండును. మనవైద్యులు చేసెడియోగములలో రసముకంటె తక్కువ గంధకము నెప్పుడును తీసుకొనరు. గనుక సిందూరించని రసము మిగిలి యుండకూడదు.

ఆయుర్వేద వైద్యులకు తెలియవలసిన రెండవసంగతి తూనిక సంబంధమైనది. ఆఱుతులముల రసమును 36 తులముల గంధకముతో కలిపి నూరి సిందూరింపజేసినప్పుడు 6 తులములకంటె నెక్కువ షడ్గుణము రాదని మనవైద్యుల యభిప్రాయము. అనుభవములో 6 తులములకంటె కూడ తక్కువరావచ్చును. కాని శాస్త్రప్రకారము ఆరున్నర తులముల షడ్గుణము రావలెను. ఆఱుతులముల రసము ఆరతులము గంధకముతో సంయోగించిన షడ్గుణ మగును. ఇట్టి స్థితిలో ఆరున్నరతులములకంటె తక్కువ షడ్గుణము రాకూడదు. ఐనను వండుటలో నెక్కువగ కలిపిన గంధకమే కాక సిందూరము కూడ కొంతయావిరిరూపమున నెగిరిపోవును. ఇందుచేత షడ్గుణము యొక్క తూనిక తగ్గును. ఈరీతిగనే లోహాదులను భస్మము చేయునప్పుడు భస్మముల తూనిక ఆయాధాతువుల తూనికకంటె నెక్కువ రాకూడదనియు సరికి సరి తూనికవచ్చు వరకును పుటములు వేయుచుండవలెననియు మనవైద్యుల యభిప్రాయము. కాని యీయభిప్రాయము శాస్త్రసమ్మతమైనది కాదు. లోహాదులు భస్మములగు నప్పుడవి గాలిలో నున్న ప్రాణవాయువుతో సంయోగించును. అనగా ధాతువులును ప్రాణవాయువును చేరి భస్మములగుచున్నవి. అందుచేత భస్మములయొక్క తూనిక ఆయాధాతువుల తూనికకంటె నెక్కువగనె యుండవలెను. భస్మీకరణమునందు ధాతువులను ఓషధులతోను పసర్లతోను గలిపి నూరుదురు. అప్పుడు కొంతమందు ఖల్వమును బట్టుకొని యుండును. పుటము వేయునప్పుడు కొంత ఎగిరిపోవచ్చును. ఇట్టి కష్టములులేకుండ భస్మీకరణము చేసినయెడల భస్మములయొక్క

తానిక ధాతువుల తానికను మించియుండును.

ధాతువులు భస్మములుగ మారునప్పుడవి మృత ధాతువులగు ననియు, అట్టి వానికి పునర్జన్మ మసంభవమనియు మన వైద్యుల మతము. అనగా లోహ సిందూరమునుండి లోహమును - పద్గణము నుండి రసమును తిరిగిసాధించుట యసంభవమని వారి యభిప్రాయము. భస్మములు ధాతుజన్యములు. ఇట్టి భస్మములు నిర్దుష్టములగునో కావో నిర్ణయించుటకు మనవైద్యులు రెండుమూడు విధముల పరీక్షించెదరు. ఇందు మొదటిది భస్మము నిశ్చంద్రికయగుట. అనగా ధాతువులకు సహజమగు తళుకుపోవుట. భస్మము వారితరమగుట రెండవది. అనగా నిర్దుష్టములగు భస్మములు నీటిమీద తేలును. మూడవది భస్మములను వ్రేళ్లమధ్యను నొక్కినప్పుడు రేఖలు భస్మముపై నంటుకొనును. సరియైన భస్మములగునో కావో పరీక్షించుట కీమూడును మంచిసాధనములే. కాని యట్టి భస్మములనుండి తిరిగి ధాతువులను జనింపజేయుట యసంభవమనుకొనుటగాని యసాధ్యమనుటగాని శాస్త్రసమ్మతము కాదు. మృతధాతువులనుండి ధాతువులు తిరిగి జనింపజేయవచ్చునని పాశ్చాత్యరసాయన శాస్త్రమే కాక మన యాయుర్వేద గ్రంథములు సయితము చెప్పుచున్నవి.

ప్రతిభస్మమునుండియు మృతధాతువును జనింపజేయుట యిప్పుడు సాధ్యమగుచున్నది. ఇందుకు వేడిమి ముఖ్యసాధనము. నవీన శాస్త్రపద్ధతుల ప్రకారము విద్యుచ్ఛక్తి ప్రబలిన తరువాత ప్రతి భస్మమునుండియు ధాతువులకు పునర్జన్మమొసంగుట సులభమైనది. మనవైద్యులు చేయు పుటయోగములలో వేడిమిచాలక ధాతువులు తిరిగి జనింపక పోవచ్చును. కొన్ని భస్మముల కీవేడిమే చాలి ధాతువులు తిరిగి జనించును.

ఈ విషయము మనవైద్యులకు సయితము తెలియును. నిర్దుష్ట భస్మలక్షణములు తెలుపుచు, అట్టి భస్మమును కొన్ని పదార్థములతో కలిపి యూదినప్పుడు ధాతువు జనింపకుండినయెడల మంచిదని చెప్పిరి. కాని ధాతువును భస్మమునుండి జనింపజేయుట యసాధ్యమని చెప్పలేదు. రసరాజీయమునందు :—

శ్లో. సర్వమేవ మృతం లోహం ధ్మాతవ్యం మిత్రపంచకైః ।
ఇత్యేవం స్యాన్నిరుత్థానం సేవ్యవారి తరంథవేత్ ।

భస్మమును మిత్రపంచకములో—అనగా బెల్లము, గుగ్గిలము, గురిగింజ, నెయ్యి, వెలిగారములతో చేర్చి యూదినప్పుడు తిరిగి ధాతువు జనింపక నీటిమీద తేలినయెడల భస్మము పరిశుద్ధమని దానిని సేవింపవలయును.

దీనిని బట్టి మిత్రపంచకము భస్మపరీక్షకేర్పడిన మంచిసాధనమని తెలియుచున్నది. ఈ పరీక్షకు లొంగనియెడల భస్మము నిర్దుష్టమని చెప్పవచ్చును. ఇంతియు కాని మరియొక సాధనముచేసినట్టి భస్మమునుండి ధాతువు దీయుట యసాధ్యమని యర్థము కాదు.

ప్రస్తుతము మన దేశములో చాలవరకు ఆయుర్వేద శాస్త్రజ్ఞానము తగ్గి వంశపరంపరగ వచ్చు వైద్యసాంప్రదాయమే మిగిలియున్నది. ఇప్పుడిప్పుడు మనవారు ఆయుర్వేదమునకు తగిన ప్రాముఖ్యము నిచ్చుటకు కళాశాలలు బెట్టియు పరీక్షలు చేసియు వైద్య శాస్త్రజ్ఞులకు శిక్షగఱపుచున్నారు. ఇట్టి సందర్భములలో నట్టి కళాశాలలలో జదువువిద్యార్థులకు నవీనరసాయన శాస్త్రజ్ఞానమును కూడ కొంత నేర్పుట యవసరము. రసాయనశాస్త్రమునొక్క మూలసూత్రములు తెలిసినప్పుడే యాయుర్వేదవైద్యులు తమ శాస్త్రమునందు చెప్పబడిన యోగముల యర్థమును పూర్తిగ గ్రహింప గలుగును.

# వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు

## తుమ్మల సీతారామమూర్తిగారు

శ్రీమత్కృష్ణాకూలాబ్ధిచంద్ర! గుణరాశీ! వేంకటాద్రీంద్ర! సం
గ్రామోర్వీసురరాట్సుమార! నగధీరా! సుందరాకార! నా
నామాణిక్యవిరాజమాన మకుటాంచన్మస్తకా! కోవిద
స్తోమస్తుత్యచరిత్ర! దీనజనబంధూ! రాజకంఠీరవా!

ఉ. అరయగ నీవు నామునకు వర్తులకిచ్చు ధనంబుతోడ నీ
ధరం గల రాజు లందఱును దా మొక వత్సర మాత్రకాలికిన్
గరుణ నొసంగు విత్తమయి నన్ సరివొవ్వునె? జగ్గధారుణీ
శ్వరతనయా! దయానిలయ! సర్వధరాధిప! లోకభూషణా!

చ. ఎంతతపం బొనర్చెనొ బళీ యమరావతిపట్టణంబు. భూ
కాంతవరేణ్య! మీ రచట గాపుర ముండగ నాంధ్రదేశ మెం
తెంత తపం బొనర్చెనొ? తదీశుడవై వెలయంగ నీవు ధీ
మంత! కళానికాంత! గుణమండన! శాత్రవలోకభంజనా!

సీ. తనముత్తు బంగారు తాసునందున దూచి
బ్రాహ్మణోత్తములకు బంచిపెట్టె
అన్నప్రదానంబు ననుదినంబును కోటి
ధారుణీసురులకు దయనొనర్చె
అగ్రవర్ణుల కిచ్చె నగ్రహారశతంబు
సతిచేయ్కతో గోరినట్టి చోట్ల
మించిన భక్తిగ గట్టించెను శివకేశ
వాలయంబు లనేక మవనిలోన

గీ. సేతుశీతాద్రిమధ్యధాత్రీతలమున
దనకు సరియైనవాడగు దాతలేడ
టంచు చేరంగ నఖిలజనాళి చేత
పొగడ వేంకటాద్రిప్ప ధీవరుండు.

సీ. సంస్కృతాంధ్రాది భాషలలోన మిక్కిలి
పాండిత్యవిభవంబు బడసి మించి
కవిపోషణం బందు ఘనుడైన కృష్ణరా
యలకన్న మిన్నయై ఖ్యాతి నంది
దేవిభాగవతాది దివ్యకావ్యంబుల
కృతినంది సాటి భూపతులు మెచ్చ
పండితకవికోటి వలన "నవ్యశివభో
జ"సమాఖ్య బిరుదరాజంబు నంది

గీ. కోటి రాజులలో పెల్ల మేటి యగుచు
వాసిగాంచితి వయ్య శ్రీ వాసిరెడ్డి
వేంకటాద్రిమహీపతి! విమలకీర్తి!
కవిజనస్తుతినామ! సంగ్రామభీమ!

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు

డి. శేషాచార్యులు గారు

కమనీయుఁడు వైద్యవరు లగు శ్రీమాన్ రామకృష్ణమాచార్యులకును శ్రీమతి రాజ్యలక్ష్మమ్మకును అంగీరససంవత్సర ఆశ్వయుజమాసమున జనన మందిరి. వీరిది గౌతమ గోత్రము. జన్మభూమి మచిలీపట్టణము. వీరు పిత్రుపైతామహికముగ నున్న చికిత్సాచరణమును శాస్త్రపరిజ్ఞానముచే వికసింపఁజేయ దలంచి మైసూరు రాజధానిలోని సంస్కృతకళాశాలలో పుట్టస్వామి శాస్త్రులవారియొద్ద సంస్కృతాయుర్వేదములలో మంచిపాండిత్యమును గడించిరి. మైసూరుగవర్నమెంటు హాస్పిటలునందు శ్రీ యూపథమున ఆరోగ్యతాపత్రములఁ బడసిరి. పిదప నాయుర్వేదమునకు ప్రధాన స్థానము లగు కలకత్తా, బొంబాయి, కాశ్మీరము లాహోరు, హరిద్వారము, జయపురము, కాశీక్షేత్రము, మున్నగు స్థలములందు సంచరించి యచ్చటగల ఆయుర్వేద విద్వాంసులతో సంప్రతించి విజ్ఞానవిభవమును సంపాదించి చికిత్సాలయముల పర్యవేక్షణముచే క్రియాచరణమున నైపుణ్యము నిను మడించి ప్రశస్తినొందిరి. పిమ్మట బెంగుళూరున వైద్యశాలకు చికిత్సకులుగా వెడలి కొంత కాల మచ్చట పనిచేసిరి. తరువాత చెన్నపురిఁజేరి శ్రీకన్యకాపరమేశ్వరీ దేవస్థాన ధర్మవైద్యశాలకు ప్రధాన చికిత్సకులై వ్యాధిపీడితు లగు ననేకులకు నారోగ్య మొసంగుచుండిరి. అటుపైని కొలదికాలములోనే ఆ ధర్మవైద్యశాల కనుబంధముగ నియమింపఁబడిన కళాశాలకు ప్రవర్తకులుగ నుండి యన్నివిధముల దానిని నానాటికి వృద్ధి నందించుచు ననేక దేశములనుండి చనుదెంచిన విద్యార్థులకు ప్రతిఫలాపేక్ష లేకయే ఆయుర్వేదవిద్యను లక్ష్యలక్షణ పూర్వకముగఁ గఱపుచు తమ ప్రతిభాకౌశలమును వ్యాపింపఁజేసిరి.

కొంతకాలము గడచునప్పటికి శ్రీకన్యకాపరమేశ్వరీ దేవాలయాధికారులు కళాశాలను మానివేయవలసి రాఁగా శ్రీ యాచార్యుల వారు పూనికతో నా కళాశాలను తామే నిర్వహింప బూనుకొని శ్రీచెన్నపురాయుర్వేద ప్రచారిణీసభ, యనునొక సంస్థను స్థాపించి యీ కళాశాలను తదనుబంధములగు వైద్యశాలను ఔషధాలయమును క్రమముగ నభివృద్ధి గావించిరి.

పంజాబు, మలబారు, వారణాసి కలకత్తా, సింహళము, మొదలగు దూరదేశములనుండియును విద్యార్థులు పలువు రేతెంచి యాయుర్వేదమును శ్రీయాభ్యాసపూర్వకముగ నిచ్చట నభ్యసించి తమ వైదుష్యమును నలుదెసల వ్యాపింపఁ జేయుచు ఆచార్యుల వారికి అసమాన యశస్సును గల్గించిరి. వీరు ౧౯౦౪వ సం॥న బొంబాయి వస్తుప్రదర్శనమునందు హైమాదిపాకము మున్నగు ఔషధరాజములను ప్రదర్శించి ఒక స్వర్ణపతకమును, ప్లేగుమందులకై శ్రీ గద్వాల సంస్థానము వారిచే నొక వసిడీపతకమును పారితోషికమును పొందిరి. ౧౯౦౫వ సం॥న బనారసు ప్రదర్శనమునందును, ౧౯౦౬వ సం॥న కలకత్తా ప్రదర్శనమందును బంగారుపతకములతోను, మొదటితరగతి ఆరోగ్యతాపత్రములతోను గౌరవింపఁబడిరి. ౧౯౦౭వ సం॥ కలకత్తా నగరమున భిషఙ్మణి యను బిరుదముతోడను ఆసంవత్సరమునందే మే నెలలో నాసికాక్షేత్రమున నాయుర్వేదమార్తాండ బిరుదముతోడను బహూకరింపఁబడిరి. ౧౯౧౩ సం॥న జార్జి సార్వభౌములు వీరికి వైద్యరత్న మను బిరుదము నిచ్చిరి. వీరు కొల్లం గోదుసంస్థానమున జరిగిన ఆయుర్వేదీయ సప్తమ సమావేశమున కధ్యక్షత వహించిరి. వీరు ఆయుర్వేద వ్యాప్తికై పలు ప్రధానకృత్యములలో సభాధ్యక్ష పదవి నలంకరించుటకు ఇదియే యారంభము.

౧౯౧౩ వ సం॥ ఏప్రిల్‌లో బొంబాయి రాజధానిలో జరిగిన నిఖిలభారతవర్షీయాయుర్వేద మహాసమ్మేళనమునకును, ౧౯౧౭ వ మే నెలలో హరిద్వారములోని ఋషికుల బ్రహ్మచర్యాశ్రమమున జరిగిన ఆయుర్వేద వైద్యమహాసమ్మేళనమునకును, ఆసంవత్సరము ననే నవంబరు నెలలో బెజవాడలో జరిగిన ప్రథమాంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనమునకును, ౧౯౧౮ వ సం॥ ఫిబ్రవరి మాసమున తెనాలిలో జరిగిన గుంటూరుమండల ప్రాథమికాయుర్వేద యూనానీ వైద్యసమ్మేళనమునకును అవత్సరమే ఏప్రెల్ నెలలో లాహోరుపురమున నిర్వర్తింపఁబడిన నిఖిల భారతవర్షీయాయుర్వేద నవమ వైద్య మహాసమ్మేళనమునకు ౧౯౧౯ వ సం॥ ఆగస్టు నెలలో తిరువహీంద్రపురమునఁ జరిగిన ద్వితీయ ద్రావిడాయుర్వేదవైద్య సమ్మేళనమునకును, వీరు అగ్రాసనాధిపత్యమును వహించిరి. ఆయుర్వేదవిజ్ఞానము విశేషముగ వ్యాపించుట కనుకూలముగ మాధవనిదానము అర్కప్రకాశము, రసప్రదీపిక, పథ్యాపథ్యము, ఆయుర్వేదపరిభాష, భేషజకల్పము, ఇత్యాదిగ్రంథములను ఆంధ్రటీకాతాత్పర్యములతో వివరముగ వ్రాసి ముద్రింపించిరి.

శ్రీ వైఖానస మహాజన సభాస్థాయిసంఘ సమావేశమునకు గుంటూరు జిల్లాలో చేరిన వేటపాలెమున 14-9-20 తేది మంగళవారమునందు దయచేసిరి. వీరు స్వకీయమత సభలకు వెళ్లుట కిది ప్రథమపర్యాయము. శ్రీవైఖానసమహాజనసభ కగు పండిత సన్మానమునకు ప్రతివత్సరమును రూ 120 నొసంగ వాగ్దాన మాచరించిరి. శ్రీవైఖానస పత్రికా గ్రంథమాల ననేకవిధముల సత్కరించిరి. ఇట్టి మహనీయుఁడు- ఉదార పురుషుఁడు- ఆయుర్వేదమార్తాండుఁడు- ఆంధ్రజనని ముద్దులపట్టి- రౌద్రి సంవత్సర భాద్రపదబహుళ పాడ్యమీ బుధవారమున నస్తమించెను.

# స్మృతి పద్యములు

శ్రీ లీలాపరజీవవైద్యుఁ డని ధాత్రిం దన్నుఁ గీర్తింప, ప
ద్యోల్లాభంబునఁ గుక్షినించుకొనకాయుర్వేద వైద్యప్రచా
రాలంబంబె పవిత్రజీవనము గా వాంఛించు, మా దీవి గో
పాలాచార్యుఁడు వైద్యరత్న మకటా పైలోకముం జేరెనే.

క. మాపాలిటి మందారము
మా పెన్నిధి మాగురుండు మామాన్యుఁడు మా
గోపాలాచార్యుం డ
న్నా పోయెనె మమ్ముఁ బాసి నాకమ్మునకున్.

మ. అనఘా నీవు ఇహరాత్రి మంటి వని యేమాలించుమాత్రాన గ్ర
క్కున మాగుండెలు వ్రయ్యలయ్యె నపుడా గోదావరీ మండలం
బునఁ గావించిన వైద్యసంస్థమున, నాము స్వెట్లు దప్పించుకో
న్న నినున్ మ్రింగెనకాలమృత్యు వకటా నష్టాదు దౌష్ట్యంబులోన్

సీ. నినుఁ గాంచఁ బద్మాలయను గూర్చి వ్రత మేమి
పలిపెనో రాజ్యలక్ష్మమ్మ తల్లి
తిలకింప రామకృష్ణుల కిడెనో యెన్ని
పూజలు రామకృష్ణుండు పరము
నిను శిష్యుఁగాఁ గాంచ వనజాక్షు ని సపర్య
లేమి జేసెనో భట్టస్వామి గురుఁడు
నిను భక్తుగాఁ గాంచ నఖిలేశు సేరితి
నర్పించెనో యార్ష యాంధ్రమాత
ఆరయఁ బితరులను గురులను పట్టినంత
మవని ధన్యత గాంచిన ఘనుఁడ నిజము
దీవివంశంబె యుదృతంపు దీవి. కాని
యకట గోపాల మముఁ బాసి యరిగి తెట్లు ?

సీ. పలుకంబు శాంతరసం బొల్కుచుండు నీ
యకలంక ముఖచంద్రు నరసి యరసి,
నిష్కల్మషై నింపు నీదు దాక్షిణ్యంపు
టీక్షణ స్తోమంబు నెంచి యెంచి
నెమ్మది మ్మదయించు నీ మహామంద మం
దస్మిత శోభలఁ దలచి తలచి
యఖిల లోకులకు మహారోగ్యదంబగు
నీదు వాక్సుధ పాత్ర నిలిపి నిలిపి.
పొగులుచున్నారు నీదు బంధుగులు వైద్య
గణము లాప్తులు శిష్యలోకములు నాయ్య
లఖిలజనములు నీకు వారనక నిపుడు.
మఱల యెప్పుడైన నగుదు మె మాకు నిన్ను?

సీ. ధన్వంతరి నిను మాకిఁ దాల్పవే యెన్నైన
మండలాయుర్వేద మహితసభలు
నినుఁ బరీక్షకుఁ గాఁగ గొనలేదె యగణితా
యుర్వేద పాఠశాలోత్తమములు
నినుఁ బ్రధానచికిత్సకుని గా బడయరే కృ
తార్థులై పెక్కండ్రిలాధిపతులు
నీ స్వగ్రపీఠిని నిల్పదే పలు మాఱు
భారతాయుర్వేద ధురీణసంఘ
మక్కట యక్కట! నేడు నిన్నంత కన్న
మన్నంత బగు పదవులనుంచ నెంచి
నమరపురికి గొంపోయిరో నావిధాత
దీవికులచంద్ర! గోపాల ధీమహేంద్ర!

సీ. ఏ యింటఁ గనుగొన్న నీయనామధనుధా ని
దానంబులే గదా ధన్యచరిత
ఏపత్రికారాజ మీక్షించినను నీదు
ప్రకటనలే గదా ధర్మ్యచరిత
ఏ వైద్యతతి గోష్ఠి నెలమితో విన్నను
నీ ప్రశంసయె గదా నిర్మలాత్మ
ఏ యూరఁ గనుఁగొన్న నింపైన నీ యౌష
ధంబులే గదా సదయహృదయ.

గీ. అకట దుర్వైద్యతిమిరంబు నణఁచి విపుల
విపులసద్వైద్య తేజంబు వెలుఁగఁ జేయు
నీ మహాజ్యోతి యేమయ్యె? నోమహాత్మ
వైద్యలోకంబునకు లోటుకలిగె నేడు.

శా. ఆయుర్వేదము నుద్ధరింప భరమైయుంటైన సర్వస్వమున్
ప్రాణంబున్ వినియోగ పెట్టి మిగులన్ భాసిల్లి యున్నట్టి నీ
యాయుర్వేద కళాలయం బికను నేయాధారతన్ బొందునో
ఆయుర్వేదపితామహా! యెఱుఁగ మయ్యా చెన్నపట్టంబునన్.

ఉ. చారత రాపవర్గమున, స్వర్గమునందో, విపుతమందో నీ
కోరిక చొప్పు లెట్టటు లఖండితవైభవయుక్తితోడ వి
స్తారసుఖంబు జేకొనుము సర్వమునవ్వమణీని కాచు స
త్కారముతోఁ బరాత్పరు నఖండకృపన్ సుఖయుండుమా బుధా.

కోన రాఘవయ్య గారు

మ. జననీ భారత మాత నీదు సుతులీష్మాఖండలిన్ ధన్యులా
యనఘోత్తం ముల జూడి కొంచు మది నిత్యానందమున్ బెందునీ
ఘనమోదంబును భంగపుచ్చి యకటా కారాని దుఃఖంబు గ
ల్పనఁ జేసెం గద నీకు నావిధి బుధుల్ ఖేదంబునన్ దూరగాన్.

శా. ఆయుర్వేదము నుద్ధరించుటకునై యాంధ్రప్రపంచంబునం
దేయూవిర్భవ మొందె జీర్ణదశలో నేమూలనో యున్న యా
యాయుర్వేదము నుద్ధరించి నిజవిద్యశ్రేణి విఖ్యాతిమై
యూయాంధ్రోర్విని మించఁ జేసిన మహుం డేగెన్ దివికో వాదగన్.

బీ. డీ. ప్రసాదరావు

కీర్తిశేషులైన లోకమాన్య బాలగంగాధర తిలకు




శ్లో. యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.

### చంద్రమౌళి చిదంబర రావు గారు బాపట్ల

సీ. తెలివికంటెను నాత్మబలమె యుత్తమదేశ హితసాధనంబని యెంచి
గినాఁడు, భగవంతు కేవలోపకరణ ప్రాయుఁడై జీవ నోత్సర్గమున్
జేసినాఁడు, మనుజమనోతీత మానితేశ్వర శాసనముల విశ్వాస
మ్మునవహించినాఁడు భూతస్థితులకంటె పూర్వతధాని సంస్థితుల
మనోదృష్టి నిల్పినాఁడు, భవ్యజాతీయజీవన ప్రభవ కారణాధ్యాత్మవిద్యా
కలా శేఖుఁడగుచు, కర్మయోగ నిష్ఠుఁడై జనులకు నుత్తమంపు
బోధగల్గించె బాలగంగాధరుండు.

### ఆంధ్ర సోదరులు, అవుకు

గీ. జన్మమెత్తినదాది, దేశమున సుప్రసిద్ధుఁ డగుచు ప్రజాసేవఁ జేయు
చుండిన, జీవితం బంత దాన వసెంచె నంబరోలిలకు మహాశయు
లెల్లరును గనంగ.

### అన్నవరపు లక్ష్మీనరసింహముగారు, నెల్లూరు

గీ. దేశసేవాపరుఁడగుచుఁ దేజరిల్లి మాతృదేశాభివృద్ధి సవరుచ్ఛపుత్రు
నపైనీపాదు బొట్టను బెట్టుకొంటె మృత్యుదేవతా! నీక్రౌర్య
మెంతగలదో?

### దామరాజు పుండరీకాక్షుడుగారు

సీ. అమరలోకాధిపత్యము వహించుట కెవ్వ, రాహ్వానమింతలో నంపి
రయ్య, ఇహలోకయాత్ర చాలింపగా నిన్నింత విసికించి విసికించి
వేచిరేరు; హైందవుల్ వహుచున్న యగచాట్ల మొఱవెట్ట, శ్రీరాము
కడకు వేంచేసితయ్య, తిలకాకతారంబు నిలసమాప్తము చేసి, కలికి
కై పుట్టంగ కాంచుటయ్య, శ్వేతకుటుంబదేడ నీవట్లు శేలువనుచు,
స్వప్నమందైన నమ్మని కాంతమాత, ఘోషమితిమీరి కన్నులు
గూలిపోయె, భారతంబింక నెటులఁ బ్రతుకగలదో?

### గు. వెంకన్నగారు

సీ. భక్తి పాంచిరిపోక భరతమాతకు సేవ జేసిన సుపుత్రులలో శ్రేష్ఠ
ముఁడు, భూరమై తెలువారు గీతార్థసారంబు విప్పిచెప్పిన యట్టి
విబుధవరుఁడు, ఖైదుబులో నుంచి భయమున్న దెలుఁగక శ్యా
యమ్మునకుఁ బోరు నజువినుంకు, హిందుదేశము నుద్ధరించు బుద్ధి
తో పెక్కు చిక్కులబడ్డ పెద్దవాఁడు, లోకమాన్యపుబిరుదము
వీకఁగొన్న, బాలగంగాధరతిలక పండితుండు, ఘనమదంబున
సురలు స్వాగత మొసంగఁ, జేరె స్వర్గంబు; దేశంబు చిన్నవోయె.

### పొన్నాడ కృష్ణమూర్తిగారు రాజోలు

మ. అకటా! భారతవర్ష బాంధవుఁడు విద్యావార్ధి గీతారహస్యకలా
బోధకుఁ డార్తరక్షకుఁడు సత్యాలాపుఁ డాధ్యుండుని ర్వికల
స్వాంతుఁడు కర్మయోగి సుజనప్రీతుండు విజ్ఞానధైర్యకలాపుం
డగు లోకమాన్య తిలకుం డస్తంగతుండయ్యెగా!

ఉ. ప్రజలతిభక్తిఁ గొల్వఁగ స్వరాజ్యఫలాప్తికి సత్రయత్నముల్
నిజముగసల్పి మూఢజననిందల కోర్చి ప్రవాసవేళలన్ గజిబిజి
తాగి దేశహితకాంక్షను కష్టములొంది యక్కటా! విజయముగ
ల్గదేశ మనవీరుఁడు స్వర్గముఁ జేరఁ జెల్లనే.

### నత్తెనపల్లి హనుమంతరావుగారు, దుగ్గిరాల

సీ. బ్రిటిషు కార్మికవర్గ- ప్రేమసంపాదింప, నింగ్లాండునకు నిప్పు డేగి
నాఁడో? క్రొత్తసంస్కారణంబు- లుత్తమే యని తెల్పుపాశ్చాత్య
మార్గంబు- జనినవాఁడో? పంజాబువధలలో- పడిన్పృతులకై కట్టి,
వారిసోదర్వుఁడా- జేరవాఁడో? గీతారహస్యమున్- గిమ్మతికినిదెల్ప
స్వర్గలోకమునకు - జనినవాఁడో? దేశమున్క్షితిగనలేక - రోసమెడి
యెు; దివ్యలోకంబునందున్న - దేశభక్త, తెల్లియాచన దెల్పుదు
రేమొ మనుమ, సరిగివాడ లేదో? మాతిలకు - అమ్మ! చెప్పుడు.

### దోమా వేంకటస్వామిగుప్తగారు కర్నూలు

సీ. పదిమందిమెుకట నీవది తిప్పెఁ జేరినీ దైవచారిత్రంబు నరసి యు
కసి, ప్రావృదంబుదమునం బడు వర్ష మున ధించుఁ గన్నీట నేద
సం గాంచి కాంచి, భవదీయ కృతమైన పావనంబైన గీతాఠవ్య
తంబుధినోలలాడి యాడి, మాఁడు మూర్తులఁ బోలఁ బురుషులం
దునవోక్క పురుషుఁడేఁ గెనఁటుంచుఁ బొగిలిపొగిలి, - ఇటుల
స్మరియుంచుటే కాని ఇంక నేమి చేయుటకు నైనసాధ్యమే?
చిత్తమందు, ఆర్తిగించి, మాకుంగానేఁ జెలఁగునీదు, శక్తిలో; గొం
తవయ నీయఁ జెలఁగుఁ దిలక!

### ప్రొఫెసర్ బుఱుసు రామజోగరావుగారు మద్రాసు

ఉ. నూతన రాజకీయ ప్రతరూపుర ధార గభీర వీరకూ, భూతనగర్వ
భంగ గుణపూత ఘనాఘనతుల్య రక్షితోపేత వసుంధరాధరణ;
ప్రేక్షణ భారతమాత స్వేచ్ఛన స్వేతన గీత పాఠకయు తీవ్ర
తిలకమహేశ్వరా! హరా!

### శ్రీమతి నాగేశ్వరీదేవిగారు

సీ. ఎవ్వాని వాక్సుధాసుస్వాదు నిమ్న గాంతరమున గ్రుంకియుఁ దని
యఁ గలమె? ఎవ్వాని ధైర్య మహిమ మహీంద్రంపు ప్రాంగణ
తలమున నిల్పితిమఁ గలము, ఎవ్వాని సద్రూపమిందీవర ప్రియకాం
తికే జగమును గాంచఁగలము, ఎవ్వాని యుద్గ్రంథ మింపారు
భాషను వెలుగుచేనేఁ విూఁదఁ వెలయఁగలము అనుచు సోదర
సందోహ మడరు చుండఁ, గల్పభూరుహ పల్లవ కలికమృదుల
శయ్యపైఁ బవ్వళించితే శంభురూప, బాలగంగాధర తిలక
భవ్యచరిత!

### వ. శంకరశర్మగారు కర్నూలు.

ఉ. ఎందఱు లేరు కీర్తిధనులు, సెందఱు లేరిఁక గార్యవాదులున్, స్నెం
దఱు లేరు? పండితులు ఎందఱు లేరు, జగత్సుపూజ్యులు, స్నెందఱు
లేరు ధార్మికులు, సెందఱు లేరు, సుధీగుణాఢ్యులు, స్నెందరు
లేరు క్షితిలను, నీదగు వారలు లేరు గాంచగన్.

కూచిమంచి సుబ్బరాయకవి పీఠికాపురము

సీ. భోజనాతురుఁ డన్నమును గంచుచుండఁగ, భర్జన భాండంబు పగిలి
నట్టుల, బహుపిపాసను నీరు బడయ నుండఁగ చటుక్కున త్రాడు
తెగి చేద కూలినట్టుల, సుడిగాలిలో నావ నడిసంద్రమున బోర
పెల్లునఁ జుక్కాని విరిగినట్టుల, నడుమ రేయి, జీఁకటి బడియేగు
తరి దీపమును, జటుక్కున నారి పోయినట్టుల, గమ్యపదమును
జేరగాఁ గడగి, నిన్నెయూతగాఁ గొన్న భారతిఁ మాతకిప్డు,
దధికని వ్యథగల్గించి, యవని విడిచి తివ్వరో, బాలగంగాధ
రాఖ్యతిలక!

పాతూరి రామమూర్తి

సముద్రాల వెంకటరాఘవాచార్యులు గార్లు

చ. పరసభవో విలాసన యశాలి, యశస్వి ఘనుండు గోఖలే
మరణము జెందకంటికిని వంటికి నొక్కటె ధారగాగ నం
దుఃఖమున దేశమాతకు వతుల్ పచరించుచు నేమి చెప్పి నీ
కరిగితో; పుత్రదుఃఖమెటులా మెను దీర్చు లోకమాన్యుఁడా?

జి. రామలింగముగారు ఒంగోలు

సీ. ఎవ్వాని శాంతముఖేందుబింబము జోత్స్నలు, హారికరి నోకపీడ
నలఁగ జేయు, నెవ్వాని వక్తృత్వ మిథ్యబ్రుంహితముషట్లు, పరవాది
గుండియల్ బగుల జేయు, ఎవ్వాని వాగ్జాల మెఱుఁగం భారతి,
దేశంబునెల్ల నావేశపరచు, ఎవ్వాని రాజ్యతంత్ర వ్యాపనాపార
నీతి శాస్త్రముల నుజ్జ్వాతిలూము, అట్టి గుణసాంద్రుఁడగు నీకు
శాస్త్రరత్నమవసరంబగు సమయంబునందు నిన్ను విడిచి చనికేగ
భారత వీరమాత, బాలగంగాధరుండు నీవాఁడె యింక.

బాలకవి హనుమంత వజ్ఝల జగన్నాథశర్మగారు

లక్ష్మీపోలవరం

సీ. కుడిభుజంబది బోయె ఘోకశపాలికి, నింకమన కార్యంబులెట్టుల
గును? దేశోద్ధరణ జేయు ధీరుండు దివికేఁగ, నింకమన కార్యంబు
లెట్టులగును, భారత స్వాతంత్ర్య బద్ధకంకణు డేగ, నింకమన
కార్యంబులెట్టులగును, అనుచు భారతవాసులెల్ల నడలంచి
దుఃఖనీరధి మగ్నమై దూలుచుండ, భరతమాతృ గర్భమున దుర్భర
పుజిచ్చు, వెట్టి దివి కేగన్యాయమా! వీరపురుష.

జంధ్యాల శివన్న శాస్త్రిగారు

సీ. భారతోద్ధరణ సంభావితునకు రాజ్య తంత్రమే తారక మంత్రమ
య్యె, దేశధర్మ ప్రసంజేతకునకు చెఱసాలయే ప్రాసాదశాల య
య్యె, మాతృశోకోత్పాట నాలిడీక్షునకు కష్టాంప్తియే ఘనసుఖా
వాప్తియయ్యె, స్వార్థతాదూర విశాలమతికి ప్రపంచంబె యాత్మీ
యకుటుంబమయ్యె, అమహాత్ముండు తిలకోప నామకుండు, బా
లగంగాధరుండు కృపాలయుండు, అతని నాబాలగోపాల మం
గళార్పుపాలు గాగఁదా స్వారాజ్యమేలఁజనియె.

సీ. అద్దానిబగిసాలి నల్ల తమ్ము పాద్యమ్ము గోపాలకృష్ణ గోకలునిమ్రింగ,
శాస్త్రిపర్థంబు సార్థక నామమిద్దియు బాలగంగాధరు పాలఁబ
డియె, అధికమ్ముగా శ్రవణాఖ్య మాసము దుఃఖ వార్తా శ్రవణ
ముచే వంతఁజేర్చు, బహుళపక్ష ప్రతిపత్తిథి రాత్రి భారతపుత్రు
లకు కాళ రాత్రియయ్యె, బహువిధభయాన శనివారమును
గుచు, వ్యధితుల నొనర్చె నీ శనివాసరంబు, అక్కటా! క్రూరదు
ర్దిన మయ్యెదినము, భారతీయుల దురదృష్ట వశతఁ జేఁదు.

పాలపూడి నరసింహశాస్త్రిగారు

సీ. లోకమా! నీవు వేల్పుల చేస్తమ ఉండుట లోకమాన్యుఁడును నీ
లోనఁగలఁడె, కాలమా! నీవశ్యసునతంత్ర మెత్తనో, తిలకు నీలోన
సంతృప్తిఁగలఁడె, శాస్త్రినామకవత్సరంబ! నీ శాస్త్రతఁ జూపె
దవా బాలు సుక్కఁ జేయు, మోహమయ యా నాదు ముఖ్యపట్టణమ!
నీ సురి పెంబు దీర నీ ముద్దుబోయె. దేశమా! నీకు వంచిసందే
హాతయ్యె, రాజ్యమా! నిన్ను మెప్పింపరకుఱు లెవరో? సౌఖ్యమా!
మాకు దూరంబు జరిగితిగద, బాలగంగాధరుఁడు స్వర్గ బాగుఁడయ్యె.

దేవరకొండ జగన్నాథ రావుగారు కాకినాడ

సీ. తళతళనలరారు దారుపదంబుపై, నతినీలిమేఘుంబు లలమినట్లు
రహిమీర బాగిల్లు రాకాసుధాంశుపై, రాహుదేహచ్ఛాయ క్రమ్మి
నట్లు, చూడశోభితమైన సుందరోద్యానంబునందు దట్టపు మంచు
చిందినట్లు, నవఫుల్ల కల్హారవళి నాకరముపైని, నొటఁపాఱజడివాన
కురిసినట్లు, భారతీయుల స్వాతంత్ర్య భవనమెక్క, మెండటి
మెట్టున నడుగిడ మురియుచుండ, వారిపంతొమ. సుధ విషప్రాయ
మయ్యె, కలఁగి నీమృతి కతన నో తిలకరాజ!'

పొన్నలూరు సూర్యనారాయణశర్మగారు

సోమవరప్పాడు, కృష్ణా

సీ. భరతఖండమునందు భవ్యతేజస్ఫూర్తి-గాంచెఁదా నెవ్వానిఁ గాం
చుకలిమి, నఖిలభారతసంఘ మరయ నెవ్వాని దీ, వ్యత్తేజమున
మించి వఱల వలసె, ఎవని యదృష్టంబు భువి నెట్టివారికిఁ లభియింప
దెల్లకాలములయందు, నెవనియశోలత ఏడు సంద్రంబుల కడప
టికొండపైఁ గలయఁబ్రాఁకె, నట్టి లోకమాన్యుండు దాన స్తమించెఁ
గృష్ణుఁడస్తమించిన యట్లు గిరులు నదులు,వనులు జనఘులు శోకమై
కనఁగబడియె భరతమాతకు దుఃఖ విస్తరతఁ జేసి.

సీ. అలమహారాష్ట్రి ధన్యత్వమేమని చెప్ప, భవదుదయంబును బడయు
కతన, పాంచాల దేశంపు భాగ్యమేమని చెప్ప, భవదుక్తి యుక్తులఁ
బడయుకతన, వంగదేశ ప్రవైభవంబు నేమని చెప్ప, భవదీయ వర్ణనల్
బడయుకతన, నాంధ్రదేశంపుఁ బూజ్యత్వమేమని చెప్ప, భవదుప
దేశంబుఁ బడయుకతన, నెచట నీకు చిరపదము, నూనితివి; నీదుపై
గాలిరైన సోఁకె, నెచట; నచ్చోటు పావనం జేకదయ్యె. శలిత
ధర్మ! గంగాధరతిలక శర్మ!

### సుబ్రహ్మణ్య భాగవతులు తెనాలి

సీ. మూడుభాషలను సంపూర్ణవైదుష్యంబు బడసిన యట్టి సత్పండి
తుండు, అంతరాత్మమునదే శాభివృద్ధికి కానిపనినికస్నేత్రిమా దని
స్థిరుండు, తనవైన బడినకేను వసన్యసామాన్య మనగ వాదించిన
వాగ్మియువాడి, బంధనమ్మున కర్మ పరముగా గీతలవ్యాఖ్యవ్రాసిన
మేటి భావ్యకర్త, బాలగంగాధరాఖ్యను బ్రాహ్మణుండు అఖిల
భారతజనవ్యాద యాలయముల తనమూర్తి ప్రతిష్ఠించి తాను
చేగ రిపునిసాయుజ్యమిందుకై చింతదేల.

గీ. ధర్మమునకును హానియు ధర్మమునకు
తగని యభివృద్ధికలిగిన తరుణమందు
అవని నవతారమెత్తెద నన్న నీదు
పలుకు నేనమ్మెదము వేద వాక్యమనుచు.

### గుండిమెడ వేంకట సుబ్బారావు

సీ. అతపాన సమయాన, హా, జన్మదేశమా! యంచెంత మదిఁబల్వ
రించినావొ, మరణకాలమునందు, భరత ప్రపంచమా! అనియెంత
మదిబిగ్గ, నలిచినావొ, అంత్యకాలమునందు, హా; మహారాష్ట్రమా
యని యెంతసంతాప, మందినావొ, తరలి పోయెడివేళ, ధర్మ
కవ్యారమా! యంచెంత మది విచా, రించినావొ, అకట! పర
లోకమునకు నీ, వరుగువేళ శ్రేయమెంత దీవించి, వెడలి
నావొ, భువన సంచారివై కుంతమూర్తి తెలుగమాన్య గుణధన్య
హా! లోకమాన్యతిలక!

### కర్లపాలెము లక్ష్మీనరసింహముగారు

సీ. పాశ్చాత్యనభముపై ప్రాచ్యవిజ్ఞాన చంద్రిక ప్రసరించి వ్యాపింప
జేసి, భారత హృదయచకోరమ్ములను దేవసేవామృతమ్మున తేర
దీసి సకలసు కలయముల్ సర్వేశుగీతార హస్యకరమ్ము నలరజేసి
నిజకాంతి శోభ దేశఖిల నక్షత్రాళి కాంతివెల్లవారించి వంతగూర్చి
శీతకరమున చోరులకుఁ జేసి రాగిణులయందు తాపాగ్ని రగుల జేసి
అక్కటా! క్రిడిపోయితె యభిగ్రుంకి బాలగంగాధర సుధా
కరాలలామ!

### వల్ల వేంకటశాస్త్రి

ఉ. భారతమాత నీదగున భాగ్యము నేమనిపల్కువాడ హా
ఘోరశతంసమై బరగు నూనుని మాన్యుని బాసినావు రె

వ్వారలు నీకుదిక్కుకను వంతలపుంతలుగాక యమ్మకే
నూరుల జన్మలొందియును నొందగనేర్తువె? యట్టిపుత్రకున్.

### కే. బి. కోటిలింగకవి.

సీ. అఖిల భారతనాయ కాగ్రసరుండు గీ, తారహస్యాది యుద్గ్రంథ
కర్త, సుస్వయం నిర్ణయ సూత్రోపదేశకుం, డఖిలదిగంతవి క్రాం
తకీర్తి, ఆబాల్యమాతృక శారాధనపరుండు, నధ్యాత్మవిద్యారహ
స్యవేది, సకల సద్గుణగణ ప్రకటిత సాంతుండు, కార్యశూరుం
డైన, కర్మయోగి. కష్టముల కోర్చి నిజసూను, ఖడ్గవాడి, బాల
గంగాధరాఖ్యవిద్వత్రుఖుండు తను, ధనమునంబులోరులకై ధార
వోసి, భౌతిక శరీరముంబెడఁబాసె నకట॥

### గార్లదిన్నె సుబ్బారాయుడు గారు

సీ. భరతమాత కొలుకు పలుకష్టములఁ జెంది పలుకంగఁ దగు పుత్ర
తిలకుఁడితఁడె! దుర్జను తెన్నరో తొందరల్ పెట్టిన వలయ
కోర్చిన సాధు తిలకుఁ డితఁడె, అలఁబిడ్డలయెడ నా కాంతు రొట్టె
దో తెలియ కుండిన బుషి తిలకుఁ డితఁడె, కారాగృహస్థుఁడై
కవితా సుధా రసం బోలికించె సత్కవి తిలకుఁ డితఁడె, ఇట్టి
సర్వతిలకుఁ డైతయు మహనీయు దస్తమించె శుభము లస్త
మించె, దేశచిత్రముఖకు శోకముల్ ముకులించె విధి తెలుంగు
నెంచఁ దరమె?

### దద్దనాల లక్ష్మీసత్యనారాయణయ్య గారు

సీ. ఆగస్టుమాస మారంభంబునకు నీదు కాలంబు తెల్లక కరుణసాం
ద్ర! నీవు బూనిన కార్య మెవ్వని మాపువై దిగవెట్టి చనితివి దివ్య
తేత్ర! పరమపవిత్రమా చరదీయు నామంబు వినని వారెవ్వరు
విమలచరిత! స్వారాజ్య భారంబ స్వాతంత్రులగు మమ్ము లా
చుకొమ్మను మన్న జాడగలమె దేశభక్తులలోన యీసుని కృప
కలన నగ్రగణ్యుండవై నవతరించి. నట్టివాడవు నేఁటు లంతరించి
దేశమాతను మమ్ముతి తెంపులేని దుఃఖసంద్రంబు నందుల ద్రోసి
వేయ న్యాయమే నీకు నేనిట్లు న్యాయ మార్గ

### వుదయగిరి, శీతారామాచార్యులు.

ఉ. చూచితి వెల్లదేశములు చూచితి వెల్లసభల్ నరేంద్రులం
జూచితి వెల్ల హైందవుల మంతయు టభ్యుదయంబు గూర్పగా
జూచితి వింతలోన విధిచోదితమో ప్రజలం దదేశముం
జూచితివే మిం తంత్రి దివిజొచ్చగ హా! తిలకా మహాత్మకా.

## చిన్నిబాలుఁడు

### కంచనపల్లి కనకమ్మ గారు

ఓలియ లీవి కారములు నీ చిరునవ్వులు నీవుయారముల్, తలలితంపు పల్కులును నీ సుమనోహరరూప సంపదల్
పాలమెలుంగు బుగ్గలును స్వచ్ఛవిలోచనసుందరత్వమున్, బాల రసాల నూత్నతర పల్లవకోమల హస్తయుగ్మమున్
తేలగు జారుబొజ్జయును, ఖిన్నగు చిత్తము, మందహాసమున్, జాలము గల్గజేసి మము సంతసవార్ధిని ముంచు బాలకా!

# శరన్నవరాత్ర ప్రాశస్త్యము

దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు

నవరాత్ర మనఁ దొమ్మిది రాత్రు లని యర్థము. రాత్రిశబ్దము సమాసశేషమున రాత్రమై యీరూప మేర్పడుచున్నది. దేవీప్రీతికరముగా వసంతాదు లందును ఒక నవరాత్రము చెప్పఁబడి నది. శరద్వసంతములు యమదంష్ట్ర లనియుఁ దదారంభమున నవిష్టని వృత్తికై చండీపూజనాదికము కర్తవ్య మనియు దేవీభాగవతము. ఇట్లు వసంత శర న్నవరాత్రములు రెండును సాధారణములుగా నున్నను, నిబంధకారులు ఆద్యమును విస్తరింపక శరన్నవరాత్రములనే ఎక్కువగా సభివర్ణించి యున్నారు. బ్రహ్మాండపురాణాది గ్రంథ ములయందును శరన్నవరాత్రమే ప్రతిపాదింపఁబడియున్నది. లలితా సహస్రనామ భాష్యమందు - శారదారాధ్యా అను నామమునకు ముఖ్యముగా శరత్కాలపూజనీయ యను నర్థము వ్రాయఁబడినది. భార్గవార్చనదీపిక యను గ్రంథములో-అశ్వినస్య సితే పక్షే ప్రతిప త్ప్రభృతే దినే, యనియు, మార్కండేయపురాణములో శ్లో. పూర్వ విద్ధాతు యా శుక్లా భవే త్ప్రతిపదాశ్వినీ నవరాత్రవ్రతం తస్యాం న కార్యం శుభ మిచ్ఛతా" అనియు, స్కాందమున - ప్రతిపద్యా శ్వినే మాసి సా శుద్ధా శుభదా భవేత్-అనియు దేవీపురాణములో శ్లో॥ "యో మాం పూజయతే నిత్యం ద్వితీయాదిగుణాన్వితాం ప్రతిపచ్చారదీం జ్ఞాత్వా సోఽశ్నుతే శుభ మవ్యయ" మ్మనియు అన్వ యవ్యతిరేకముఖము లైన వాక్యములచే శరన్నవరాత్రవ్రతము అశ్వ యుజ శుద్ధ ప్రతిపత్తిథిలో నారంభ మగు నని చెప్పబడియున్నది. కాఁబట్టి లోకాచార మీ విషయమున ధర్మశాస్త్రపురాణానుసార ముగా నున్న దనుట స్పష్టము. నవరాత్ర మాశ్వయుజశుద్ధ ప్రతిప త్తిథిలో నారంభమై మహానవమితో బూర్త మగుచున్నది. ఇది తొమ్మిదిదినములు ప్రవర్తిల్లవలసిన కార్య మైనను తృతీయాది నవ మ్యంతము సప్తరాత్రముగాఁ గాని, పంచమ్యాది పంచరాత్రముగాఁ గాని, సప్తమ్యాది త్రిరాత్రముగాఁ గాని, అష్టమ్యాది ద్విరాత్రముగా గాని, ఏకదినపక్షమునఁ గేవలాష్టమిని గాని, కేవలనవమిని గాని, ఆచరింప వచ్చునని సౌకర్యము చెప్పఁబడియున్నది. అకరణమందు దోషశ్రవణమువలన నిది నిత్యవ్రత మనియు ఫలశ్రవణమువలన నిది కామ్యకర్మ మనియు తేర్పడుచున్నది. నవరాత్ర కర్తవ్యములు శాస్త్రములఁ దొమ్మిది తెఱంగుల వివరింపఁబడి యున్నవి. (1) కలశ స్థాపనము (2) దేవతాపూజనము (3) సప్తశత్యాదిజపము (4) అఖండ దీపము (5) మాలాబంధనము (6) ఉపవాస నక్తైకభక్తాది నియమము (7) సువాసినీభోజనము (8) కుమారీభోజనము (9) స్తోత్రమంత్రహో మాదులు. ఇందు దేవతాపూజనము ప్రధాన మనియుఁ దక్కినవి తదం గములనియు శాస్త్రీయాభి ప్రాయము. ఈ తొమ్మిది విధుల నేయే విశేషాంశములతో - నేయేవిధమున భక్తుఁ డెట్లుపాసన సలుపవలసి నదియు భక్తితరంగిణ్యాది దేవీ గ్రంథముల యందు వివరింపఁబడి యున్నది.

రాత్రిశబ్దవిచారము

ఈ వ్రతమం దాహ్నిక త్రైకాలిక పూజ ఉపపన్నముగా నున్నను, రాత్రిపూజయే యుత్కృష్టమును శీఘ్ర ఫలప్రదమును గావున దత్ప్రాశస్త్యమున ఈ వ్రతము నవరాత్ర మని చెప్పఁబడినది. కొందఱు దీనిని నక్తవ్రతముగానే చెప్పి యాహ్నికపూజా పరిత్యాగమును బోధించిరి. కాని ధర్మశాస్త్రజ్ఞులు రాత్రిప్రశస్తివలన నహఃకార్యము త్యాజ్యము కాదనియుఁ గలశస్థాపనాది కార్యము ప్రమాణ బాహుళ్యముచేతఁ బగలే కావింపఁ బడవలయు ననియు శాసించిరి.

## నవశబ్ద విచారము

'నవ' శబ్దము శాక్తసంప్రదాయమున నతి ముఖ్యము. సంఖ్య లలోఁ దొమ్మిది కెక్కువయైన స్వతంత్ర సంఖ్య యేపరిగణనమందును లేదనుట స్పష్టముగదా! ఈ నవరాత్రపూజా విధానమున సర్వాధిక స్థానము నధిష్ఠించి యున్నది. ఈ వ్రతమునకుఁ బ్రథమాంగ మైన కల శపూజ నవాక్షరమంత్రముచేతఁ జేయవలసియున్నది. సువాసినీ భో జన కుమారీవరణములును నీనవసంఖ్యాపరిమితములై యున్నవి. వరణీయ లైన కన్యల యొక్క నామములు తొమ్మిదియు వయోనియతిని బట్టి వేర్వేఱుగా చెప్పఁబడినవి. ఇష్టదేవత యైన దుర్గ యొక్క స్వరూప ములును తొమ్మిదియే. నవకోటి శక్తి సహితయై నవావరణములకు లోపల నవదుర్గాస్వరూపమున వర్తిల్లు నవాక్షర మంత్రాధిష్ఠాన దేవతను నవసంఖ్యాపరిమితములైన దినములలోఁ బూజించుట సమంజసమే. కావున ఈ నవరాత్ర వ్రత మవశ్యానుష్ఠేయము.

## నవరాత్ర వ్రతమునకు మూలము

ఇఁకను శ్రీరామనవమి, కృష్ణాష్టమి ఇత్యాదుల కున్నట్లుల నవరాత్ర దినములకును పూజ్యదేవతా చరిత్రమునకును సంబంధ మేదేని గలదా? యనుట విమర్శనీయము. లోకాచారమును బట్టి చూడ-మన యాంధ్ర, గౌడ వంగాదిదేశములందుఁ గూడ నవరాత్ర ములలో దేవీవిజయాదికము ప్రఖ్యాతింపఁబడుటయుఁ దన్మూలమున నివి మహిషాసుర సంహారాది దేవీవిజయదివసములుగాఁ బరిగణింపఁ బడుటయుఁ గలిగియున్నది. కాని యిట్టి ప్రతీతికిఁ గారణము మృగ్యము. ఈవిషయము ప్రముఖముగా నుండవలసిన చండీసప్త శతిలోఁ గాని, దేవీభాగవతమునఁ గాని, మఱి మార్కండేయపురా ణాదులలోఁ గాని, ఇది మిథ్య మని చెప్పఁబడి యుండలేదు. శరన్నవ

రాత్రిపూజ బహుఫలప్రద మను వచనములు విశ్శృంఖలముగాఁ గలవు. కాని, ఈ యాశ్వయుజ మాసమున నీదినముల నీకార్యములు దేవిచే నాచరింపఁబడిన వను నాధారము కన్పట్టదు. విశేషించి శరన్నవరాత్ర ప్రస్తావసమయముననే వేఱొక కొన్ని దినములు గూడ ముఖ్యముగాఁ బరిగణింపఁబడి యుండుటవలన ఈదినములే దేవీవిజయ ప్రస్థానదినము లనుట కొంతవరకుఁ బ్రత్యాఖ్యాత మగుచున్నది. ఆశ్వయుజమాసాదియు, చైత్రమాసాదియు నవరాత్రవ్రతమునకు గ్రహింపఁబడుటకుఁ గారణములు దేవీభాగవతమున—

శ్లో॥ శృణు రాజన్ ప్రవక్ష్యామి నవరాత్రవ్రతం శుభం, శరత్కాలే విశేషేణ కర్తవ్యం విధిపూర్వకం, వసంతే చ ప్రకర్తవ్యం తథైవ ప్రేమపూర్వకం, ద్వావృతూ యమదంష్ట్రాఖ్యౌ నూనం సర్వజనేషు వై, శరద్వసంతనామానౌ దుర్గమౌ ప్రాణినా మిహ, తస్మా ద్యత్నా దిదం కార్యం సర్వత్ర శుభమిచ్ఛతా, ద్వావేవ సుమహాఘోరా- వృతూ రోగకరౌ నృణాం, వసంత శరదా వేవ జననాశకరా వుభౌ, తస్మా త్తత్ర ప్రకర్తవ్యం చండికా పూజనం బుధైః" అని చెప్పఁబడినదే గాని, యందుఁ గారణాంతర ముపన్యసింపఁబడలేదు. అంతే మఱియొక చోట "అష్టమ్యాం చ చతుర్దశ్యాం నవమ్యాం చ విశేషతః, కుమారీపూజా ప్రకర్తవ్యా—అని చతుర్దశీ సహితముగాఁ జెప్పఁబడి యున్నది. శాస్త్రాగమములు, పురాణములు తంత్రములు నసంఖ్యములు. అనంతములు. అట్టి వానిలో నేకేని ప్రబలాధారము చిక్కినచో విజ్ఞులకు విచార్యము. శరన్నవరాత్రములను దేవీవిజయములతోఁ గలుపు విశేషవిషయము చూపదగినను దుష్టశిక్షార్థము యుగయుగంబుల నవతరించి జగద్రక్షణ మొనర్చు జగన్మాత జగత్పూజ్యయనుటకు సందియము కలదా?

## అధిష్ఠాన దేవతాస్వరూపము

ఆర్యమత మెల్లవిధముల నవనవ్యము నన్యమతముల వలె గాక ఇది మొదటి నుండియు జిజ్ఞాసువుల బుద్ధి వైచిత్ర్యముల నెఱిఁగి తత్తదుచిత క్రియాకలాపమును నిర్మించినది. ఇట్టి సామరస్య పరాయణత యితరమతములందు లేదు. మనుష్యులు కేవలము ప్రాకృతస్థితిలో నుండు సమయమున వారికొఱకు విగ్రహారాధనాదికము చెప్పఁబడినది. విగ్రహపూజాధురంధరులైనవారలే విగ్రహమునకు మూలమైన మూర్తిని గుఱించి విచారింపఁదొడంగినపుడు పురాణేతిహాస ముఖమున నీతిబోధకము లైన అవతార చరిత్రములు వర్ణింపఁబడినవి. ఇఁకఁ గొంత జ్ఞాన మలవడి, జిజ్ఞాసు వవతార తత్త్వవిమర్శనమునకు గడంగినపుడు, జగత్సృష్టిస్థితిలయాధికారి యైన సగుణబ్రహ్మము లేక - యీశ్వరస్వరూపము నిరూపింపఁబడినది. ఏతద్రూపోపాసనలచేఁ జిత్తశుద్ధి గలిగి-పూర్ణాధికారియైన వానికి, సగుణ బ్రహ్మమున కతీత మైన యధిష్ఠానము - లేక నిర్గుణబ్రహ్మస్వరూపము బోధింపఁబడినది. మఱియు నేకావధప్రయోగన్యాయమునఁ గాక, క్రియాతత్పరునకుఁ గర్మయోగద్వారమునను, కాయక్లేశసహనశీలునకు హఠయోగద్వారమునను, మహాపోహవిచక్షణునకు జ్ఞానయోగద్వారమునను, రసికపుంగవునకు భక్తియోగద్వారమునను, ఇష్టసిద్ధిప్రాప్త్యుపాయములు చెప్పఁబడినవి. ఇట్లు మందానుజిఘృక్షచేఁ బూర్వర్షులు చేసిన యనంతవిభాగములు చూడఁగా, వారి సర్వజ్ఞత్వము వ్యక్త మగుచున్నది. భాగవతప్రస్తుత గ్రంథముకొనను విగ్రహారాధన యత్యంత ముత్కర్షింపఁబడి యున్నది. ఆ గ్రంథమందే వేఱొకచో ప్రతిమార్చనము ఖండింపఁబడినది. సామాన్యపాఠకుఁడు దీని వైరుద్ధ్యమును జూచి భాగవతకర్తకు మతివిషయమున నిశ్చితాభిప్రాయము లే దని తలంచును. కాని పరమ కారుణికుఁ డైన వేదవ్యాసుఁడు ఎవ్వని కేది చెప్పిన నుపయోగమో, అది వానికిఁ జెప్పుచున్నాఁ డని తెలిసికొనఁ జాలఁడు. ఆర్యమతమున, బుద్ధిభేదము చేయరా దని ఘంటాఘోషముగాఁ జెప్పఁబడినది. ఎవ్వఁ డేని ఏవిధముగా నేని, ఈశ్వరారాధన తత్పరుఁడై యున్న యెడల నీతిబాహ్యక్రియ లున్న వానిని దిద్దవచ్చును. గాని వానిబుద్ధికి వాఁడుచేయు పూజయం దెన్నటికిని వికల్పముఁ గల్పింపరాదు. గీతల యభిప్రాయమును నిదియే. శుద్ధాద్వైత ప్రతిష్ఠాపకుఁడై - బ్రహ్మమున కెట్టి విధమైన రూపమును గాని నామమును గాని యంగీకరింపని- శ్రీమచ్ఛంకరభగవత్పాదులు విగ్రహారాధనముఁ జేయుచుండిరి. ఇది స్వార్థముగాక శిష్య ప్రబోధనార్థ మనుట విశదము కదా. మఱియు మన యార్యమతమున 'నర్థవాద మని యొకటి కలదు. ఎవ్వఁ డేరూపమున నీశ్వరుని బూజించుచున్నాఁడో, లేక యే వ్రతము చేయుచున్నాఁడో, దానిని ఇతరము లన్నిటికంటె నధిక మని యుత్కర్షించి పొగడుట స్తుత్యస్తుతి యందురు. ఇం దుద్దేశ్యము భక్తుని బుద్ధి నన్యమునుండి మఱలించి చేయుచున్న కార్యమునందు స్థిరీకరింపఁ జేయుటయే. కాని తలపోసైన నితరవ్రతములఁ గాని యితర దేవతలఁ గాని దూషింపవలయు నని కాదు. ఇది యెఱుంగక పురాణములు పరస్పరవిరుద్ధము లని కొందఱు, శైవ వైష్ణవాది భేద ప్రతిపాదకము లని కొందఱు, తత్త్వ మెఱుంగక విభ్రాంతిపాలగుచున్నారు. స్థూలము లైన వ్రతావతార విషయములనే గాక ఇట్టి సామరస్యము తత్త్వప్రతిపాదకము లైన సద్గ్రంథములందుఁ గూడఁ గల దనియు, అవి పరస్పరవిరుద్ధములు గాక జ్ఞానసాధారోహణమునకు సోపానము లనియుఁ దానికిఁ బర్యవసానమద్వైతమం దనియు శ్రీ వివేకానందస్వాములవారు చెప్పియున్నారు.

2. పూర్వము శిష్యుఁడు గురూపదేశపూర్వకముగనే విద్య నధిగమింపవలసి యున్నందున నాతనికి శాస్త్రములయందు సందేహము కలుగుటలేదు. శిష్యుని ప్రజ్ఞ నెఱిఁగి, గురువు ఏది యెంతవఱకు ఎపుడు చెప్పిన శిష్యునకుఁ దెలియునో, యది యంతవఱకు అప్పుడు చెప్పుచున్నందున విగ్రహారాధన మెంతవఱ కుపాదేయమో, కర్మ లెంతవఱకుఁ గర్తవ్యములో, యోగ మెంతవఱకాదరణీయమో, యవి యొప్పదవవరములో శిష్యునకుఁ దెలియుచుండెడివి. ఇప్పు డన్ననో, ఇతర గ్రంథములవలె నధ్యాత్మగ్రంథములును ముద్రితములై యొక్కసారిగా మనపాలఁబడినందున, భేదములను సమన్వయించుకొనఁజాలక, వైక్లబ్యమును బొరయుచున్నారము. ఈ యవస్థనకుఁ దోడు పాశ్చాత్య సంసర్గమువలనఁ బ్రాచీనవస్తువుల ననాదరబుద్ధియు నెలకొన్నందున, దేశమున మతాభిరతి నష్టప్రాయమై, సకలకష్టముల కాకర మగు

చున్నది. తొంటివలె నధ్యాత్మవిద్యఁ గఱపు గురుకులము లేర్పడినఁ గాని, ఈ కొఱంత తొలంగ దనుట సత్యము.

8. చార్వాకులు కాయతికాదు లల్పసంఖ్యాకులు తప్ప సకల మతస్థులును జగత్కారణ మైన యధిష్ఠానము నంగీకరించుచున్నారు. అద్వైతు లిట్టిది నామరూపరహిత మనియు వాక్కునకును మనస్సునకును అతీత మనియుఁ జెప్పుచున్నారు. ఇదియే నిర్గుణబ్రహ్మము. ఇట్టి నిర్గుణబ్రహ్మము శక్తియుతమై సృష్టిస్థితి సంహారసమర్థ మైన యెడ, సగుణబ్రహ్మ మనియు ఈశ్వరుఁ డనియు వ్యవహరింపఁబడుచున్నది. ఈ యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. సర్వాంతర్యామి. సర్వశక్తి. ఈ తత్త్వము నద్వైతులు ఈశ్వరుఁడని వ్యవహరించినట్లే వైష్ణవులు (మహా) విష్ణు వనియు, శైవులు (పరమ) శివుఁ డనియు, శాక్తులు లలిత యనియుఁ ననేక నామముల వ్యవహరింతురు. ఇట్లెల్లరును నామభేదములు కల్పించుచున్నను, ఈతత్త్వమందు వారు వర్ణించు గుణములు సర్వజ్ఞత్వాదులే. దీనిబట్టి యైక్యమును నామమాత్రభేదమును సిద్ధాంతిత మగుచున్నవి.

ఈశ్వరుఁ డవతరించినట్లే లలితయుఁ దత్తత్కార్య నిర్వాహణ నిమిత్త మవతరించుట కూర్మాదిపురాణములయందుఁ జెప్పఁబడినది, ఈశ్వరుఁడు గుణభేదమునఁ ద్రిమూర్తుల ధరించినట్లే, దేవియుఁ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీరూపముల ధరించినది. శక్తితోఁ గూడుకొననిచోఁ బరబ్రహ్మము (శివుఁడు) ప్రభువు కానేరఁడు. జగత్తున్నఁ గదా యీశ్వరునకు జగన్నాథత్వము. కావున సగుణవిధ మెల్ల శక్త్యధీనమై యున్నది. ఈ యర్థమును శంకరాచార్యులు సౌందర్యలహరిలో నిట్లు చెప్పిరి:—

శ్లో॥ శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలు కుశల స్స్పందితు మపి
అతస్త్వా మారాధ్యాం హరిహర విరించి ప్రభృతిభిః
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి?

ఉ. శక్తిని గూడినన్ శివుఁడు శక్తుఁ డగున్ బ్రపంచమునందుఁ ద
ద్యుక్తిఁ దొలంగినన్ గదలలేఁడు దలం డటుగావునన్ మహా
శక్తి, హరాబ్జజాముఖవంద్యవు నిన్ గొనియాడ మ్రొక్కఁగాఁ
బ్రాక్తనపుణ్యహీనుఁ డగువానికి నెట్లు ఘటిల్లు నీశ్వరీ!

ఇది పై శ్లోకమునకు నా చేసిన యనువాదము.

నిర్గుణమైన పరతత్త్వమునకును శక్తికిని గల సంబంధము వేదాంతశాస్త్రములలో ననేకవిధములఁ జర్చింపఁబడినది. ఇది బ్రహ్మమునకు భిన్నమా? భిన్నాభిన్నమా? సావయవమా? నిరవయవమా? ఉభయాత్మకమా? సత్తా? అసత్తా? సదసత్తా? ఇత్యాదిచర్చ అమూల్యమైనది కారికలయందును భాష్యములందును జేయఁబడి యున్నది. ఈవిషయమై సీతారామాంజనేయమునుండి యొక్క పద్యము నుదాహరించుచున్నాఁడను:—

సీ. వటబీజమున మహా వటమహీరుహ శక్తి
యుజ్జ్వలవహ్నియం దుష్ణశక్తి
ఇంద్రజాలకునియం దద్భుత మాయాశక్తి
కలితోపలములందుఁ గఠినశక్తి
సలిలజాతము లందు సలలితద్రవశక్తి
పవనంబునం దతిస్పందశక్తి
పౌరి శుక్లశోణితంబులయందుఁ దనుశక్తి
తగు శరీరములఁ జైతన్యశక్తి
తే. తనరి యవ్యక్త మగుచుఁ దత్తన్నిదాన
మై యధిష్ఠానమునకంటె ననితరంబు
నగు పగిది నొప్పు బ్రహ్మమం దాత్మశక్తి
యేర్పడక యవ్యయమై విశ్వహేతు వగుచు.

జగన్మిథ్యాత్వ మనుభవమునకు రాక ప్రపంచము సత్య మని నమ్మియుంటిమేని మనము వ్యవహారదశయం దుందుమో, యంతవఱకు ఈశ్వరుఁడు మన కుపాస్యుఁడు. శక్తి యుపాస్య. ధర్మార్థకామములు శక్త్యధీనములు. మోక్షహేతు వైన జ్ఞానము తత్ప్రసాదైకసాధ్యము. కాఁబట్టి శక్తిపూజనము ఎల్లవిధముల మనకుఁ గర్తవ్యము. దేవీమహిమ ప్రతిపాదకము లైన స్తోత్రములలో యధికారవాదము స్పష్టముగా గానవచ్చుచున్నది. దీనివలన - భక్తుఁడు - యోగి - ఉపాసకుఁడు - తత్త్వజ్ఞుఁడు - సమముగా దేవ్యారాధనము నొనర్చి యానందింప ననువుపడుచున్నది.

పూజాద్యధికారులు:-

ఇట్టి సౌలభ్య మున్నది గనుకనే ఈపూజ చాతుర్వర్ణ్యమునకు మాత్రమే గాక యితరులకును ఉపదేశింపఁబడి యున్నది. ఇట్లు ఇది యెల్లర కనుష్ఠేయముగా నున్నను, క్షత్రియులకును ముఖ్యముగా రాజన్యులకును యభిహితము. దుర్గాష్టమినాఁడు రాజులు పూర్తి చేయవలసిన లోకాభిహారిక మను కర్మ యుద్దిష్టమైనది. ఇందు రాజు ప్రాక్ప్రవణమైన దేశమున షోడశహస్తప్రమాణమైన మండపముచేసి, యచ్చట నాగ్నేయమూల కోశమంద వేదికచేసి త్రైల్పి శస్త్రాస్త్రముఖ్య రాజచిహ్నముల మండపమునొద్దకుఁ దెచ్చి యర్చించి వందిమాగధపురస్సరముగాఁ గజాశ్వములతో నూరేఁగవలయును. ఛత్ర, చామర, శంఖాదులతో గావింపవలసిన పూజావిధానమును, శత్రువిజయప్రస్థానమునకు రాజు పోవలసిన తెఱంగును విస్తరముగా గ్రంథములయందుఁ జెప్పఁబడియున్నది. నిర్ణయసింధ్వాది గ్రంథములఁ బట్టి చూడఁగా నీవ్రతము దేశమం దెల్ల మున్ను మిగుల వ్యాప్తిలో నున్నట్లు తెలియుచున్నది. అనేక కారణములవలన దేశమునకుఁ గ్రమక్రమముగాఁ బ్రాప్తించిన దౌర్గత్యమువలనను క్షత్రియప్రభ్వభావమువలనను ఈ జాతీయోత్సవ మాత్మీయవైభవమును గోలుపోయి నేఁటికిఁ బలిదేవములుగాను, వైరాగిదేవములుగాను పరిణమించినది.

2 బ్రాహ్మణులలోను ఈ శరన్నవరాత్రి తత్త్వ మెఱింగినవా రల్పసంఖ్యాకులే. శాక్తులలో నుత్తరసంప్రదాయ మను వామమార్గ మొకటి యేర్పడి యాశాఖవారు మంత్రముల కపార్థములు కల్పించి

కేవల భోగపరాయణులై చెడిపోవుచుండిరి. ఇది శంకరుని కాలమునకే వ్యాప్తిలో నుండఁగా - వారు దాని నతినిశితముగా ఖండించి రని శంకరవిజయ గ్రంథమువలన నూహింపఁదగియున్నది. దక్షిణసంప్రదాయమున, మాతంగీసంకీర్తనాది కార్యములు కొన్ని కనఁబడుచున్నవి, అవి నీతిబాహ్యములు కావు. అదియును విమర్శన మెక్కువ యగు కొలఁది కాలక్రమమున నడుగంటఁ గలదు. ఇట్టి దురాచారము త్రైల్మదివలనే భువనపావనము గా చెప్పఁబడవలసిన అంబపూజ శక్తిపూజ యనునవి నేఁడు మద్యపానమునకును మాంసభక్షణమునకును పర్యాయపదము లైనవి. ఈదురాచారముల మునుముట్టఁ బోఁగొట్టి యుపనిషత్ప్రసిద్ధ మైన దేవీమతమును యథాశాస్త్రముగా జనులకు బోధించు మహాపురుషు లింకను అవతరింపవలసియున్నది.

విజయదశమి:-

శరన్నవరాత్ర వ్రతము వెంటనే, ఈ దశమి చెప్పఁబడుచున్నందున దీనిఁగూర్చి రెండువాక్యములు. ఇందువిహితములు (1) అపరాజితాపూజనము (2) సీమోల్లంఘనము (3) శమీపూజనము (4) దేశాంతర యాత్రాస్థలప్రస్థానము. అపరాజితకు, జయావిజయలు పార్శ్వదేవతలు కావున, ఈ దశమి విజయదశమి యని వ్యవహరింపఁబడుచున్నది. ఇందుఁ బూజాశ్లోకములలో శమిని గూర్చి "ధరిత్ర్యర్జునబాణానాం - రామస్య ప్రియవాదినీ" అని చెప్పఁబడియుండుటవలన ఈ శమీపూజ భారతకాలమున కీవలఁ బుట్టినట్లు కొంద అందురు. పూజ కా దన్నను, శ్లోక మైన నీవలఁ బుట్టినదే. ధర్మరాజాదు లజ్ఞాతవాసకాలమున ప్రకటనము కాకుండ దుర్గకు వరము వడసినట్లు సంస్కృతభారతమునఁ గలదు. అప్పటను దుర్గ, జయావిజయాభిధానములతో వర్ణింపఁబడియున్నందున, అచ్చటను అపరాజితయే యుద్దిష్ట యనుట స్పష్టము. శ్లో॥ ఆశ్వయుక్ శుక్లదశమీ-విజయాఖ్యాఖిలే శుభా, ప్రయాణేతు విశేషేణ - కిం పున శ్శ్రవణాన్వితా - అని జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధి కలదు. కావున రాజులకు ప్రస్థానమున కిది యుత్తమోత్తమ కాలము. కాని శత్రువిజయప్రస్థానమునవసర మైన యీ కాలమున నీ విధికి వినియోగము లేదు.

ఈ దశమికి దశహర యను నామము విఖ్యాతమై యున్నది. ఈశబ్దమే దస - దశరా యని జనులచే వాడఁబడుచున్నది. వ్రతరత్నాంతరమున దశపాపహరా యని ప్రమాణము కలదు. దశపాపములు ధర్మశాస్త్రములఁ బ్రసిద్ధములు. కావున, విజయదశమి - శమిపేరఁ గాక, యపరాజితాభిధాన మైన దేవిపేర నుప్పతిల్లిన వ్రతమనియు, దసరా యనునది దశరాత్ర శబ్దభవము గాక, 'దశహరా' యను శబ్దమునుండి నిష్పన్న మైన దనియు తెలియఁగవలయును.

కీర్తిశేషులైన

## తంజనగరము - తేవప్పెరుమాళ్లయ్య గారు

బుక్కపట్టణము రామానుజయ్య గారు

సీ. ఉభయభాషాజ్ఞాన•విభవంబుచే సుధీ
బిరుదంబుతో భువిఁ • బరఁగి తీవు
మనుచరిత్రకు మున్ను • ఘన మగు వ్యాఖ్యను
బొనరించి యెంతయుఁ • దనరి తీవు
రామాయణంబును • రహి నాంధ్రవచనకా
వ్యంబుగా రచియించి • వఱలి తీవు
పెక్కు గ్రంథములకుఁ • జొక్కంపుఁబీఠికల్
నేర్పుమై నమకూర్చి • నెగడి తీవు
అవరచిన్నయసూరియో • యనఁగఁ దగిన
పండితాగ్రణి వాంధ్రప్ర•పంచమునను;
అట్టి నీ వింతలో దివి • కరుగుకతన,
ఘనుఁడ! తీఱనిదుఃఖంబు • గలిగె మాకు!

తే. తొలుత నానందముద్రణ•నిలయమందుఁ
బండితస్థలి విలసిల్లి • దండికవుల
కావ్యశతకప్రబంధముల్ • కరము వ్యాప్తి
నందఁజేసితి వాంధ్రు లా•నంద మొంద.

తే. ఆంధ్రసంస్కృతభాషల•యంద కాక
ద్రావిడాంగ్లంబులందును • దక్షుఁడ వయి
చెలఁగితివి నీకు ప్రజ్ఞావి•శేషముఁ గని
మిత్రబాంధవు లెల్లరు • మెచ్చుకొనఁగ.

తే. పీఠికాపురాధీశుఁ డై • వెలయు సూర్య
రాయనృపు నాంధ్రకోశకా•ర్యాలయమునఁ
బండితాగ్రేసరుండ వై • వఱఁగవిల్లి
యల్పకాలంబునసె దివి • కరిగి తకట!

క. వరగీర్వాణనిఘంటువు
విరవున వ్రాయింప నెంచి • వేల్పులవారయున్
సరగున రప్పించుకొనెను
సురలోకంబునకు నిన్ను • సురగురునాజ్ఞన్!

శా. ఎందాకం దనరారు నాంధ్రవిషయం, బెందాక కావ్యజ్ఞమా
నందంబునన్ విలసిల్లు నెందనుక నాంధ్ర శ్రీరచాదేవి చే
రొప్పెందుం, దిర్పతిశాస్త్రి సత్కృతియశః పూర్ణేందు డందాక నే
కందుంగుందును లేక లోకమునకున్ గల్గించు నాహ్లాదమున్.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

చ. తిరుపతిపేడి వెంకట సుధీమణి చింతలఁ జిక్కడే, దురు
ద్ధరములు దైవ దుర్విలసితంబులు వెల్వడ లేఁగి, సజ్జనో
త్కరముల నిల్వనీయక యకాలపు మృత్యువుపాలొనర్చె నె
క్కరణి మనీషిపుంగవులు గాంతురు గాథమునమ్మ నెమ్మదిన్.

క. రంగనాథశాస్త్రులు.

సీ. అపగతోభయభావ మయ్యె నాంధ్రజగంబు నష్టావధానంబు నష్ట
మయ్యె, శతవధానంబు నె శతవిధానంబుల సాహిత్యవిస్ఫూర్తి
సమసిపోయె, బోధకతాశక్తి పోలిపోయెఁ బాండితీ నిలయంబు
లెల్లను విలయమందె, బహుమహాసభలను బహుమతుల్ వోవ శారద
విద్వత్ప్రభావంబు వీఁటిబోయె, కెలిమికర్ణంబు నశియించె బలిమి
యుడిగె, దుర్వివాదంబు చలిదీనె దుఃఖమూరె, బాలుబిడ్డల యన్న
లయందు వేంకటేశ్వరుని జోడు వీడె సహింపసభల.

కొత్తపల్లి సూర్యారావు

సీ. అష్టావధాన విద్యావిశేషమునందు నిపుణశీలుఁడటంచు నెగడినాఁడు
శతవధానవిధాన చాకచక్యమునందు ఘనుఁడంచు విఖ్యాతిగాంచి
నాఁడు, నవరసాలంకారక వనవైఖరులందు రసికశేఖరుఁడంచు నె
సఁగినాఁడు, అఖిలరాజాధిరాజాస్థానములయందు సన్మానమందంచు
పేరందినాఁడు, తాలిమితనంబుఁ దాలిచి వేలకొలఁది, శిష్యులఁ దనం
తవారలఁ జేసినాఁడు, అట్టి తిరుపతిశాస్త్రి పోవనయ్యె నెదు
వార్త శ్రుతులకు వజ్రాతి పాత మయ్యె.

పిసుపాటి చిదంబరశాస్త్రి

మ. కవితాకన్యక కింపుమీర మిగులన్ గైసేసె మాత్యాల దు
వ్వృవిమత్తేభవితానబంధముల జక్కం జీల్చె యీ ధాత్రి ను
త్కృవిసింహాంబికఁడై ఘనున్ దిరుపతిన్ గారుణ్యదృష్టిన్సదా
దివముంజేర్చి మనఃప్రశాంతి నిడ, నో దేవా! నిను న్వేడెదన్.

రాజా మం. భుజంగరావు

చ. విరియఁగ హృత్పుటంబు కడువేసటి జిక్కెరు నాంధ్రమాతరా
ల్గరఁగగ పాతమార యని క్రందుగ నేడ్చుచుఁ జింతఁజెంగగా,
నిరుపమధారణాయుతుని నిర్మలశబ్ద విలాససంఘటున్,
తిరుపతిసూరివర్యుఁ గవిధీరునిఁ గాలమ! మ్రింగితేటికే !!

నాగేశ్వరి. విద్యార్థిని.

సీ. అద్భుతంబుగ నెవ్వడాంధ్రభావను జాల నష్టావధానముల్ నడపి
నాఁడు, అష్టావధానమే కష్టమైయుండ శతావధానములను తగఁ
జేసె, పండితాళికిఁ దమపాండిత్యమునుజూపి వారిచే నెవ్వరు వడసె
కీర్తి పలుమారు దేశాధిపతు లెవ్వరిని బిల్చి సత్కారములు
చాలసల్పుచుండ్రు, అట్టి సుకవిశ్వధాటిని యంది యుండి ప్రజల
మెప్పులు మిక్కిలి వడసియున్న, సుగుణ తిరుపతి వేంకటసుకవి విద
రుల దిరుపతిమనల విడనాడి దివికిజేగె.

అ. సుబ్రహ్మణ్యశాస్త్రి.

ఉ. పంకరుహాప్త సింహము పవల్ గగనాటవి సంచరించి ని
శ్శంక గ్రహాళి వేదనల సల్పి నిశన్ విరమించు చాడ్పునన్
కింకవిరాజ మత్తగజ కేసరివై కవితామహాటవిన్
గ్రుంకితి వయ్యయో! కవుల గుండెలు తల్లడిలంగఁ దిర్పతీ!

మహంకాళి వేంకటేశ్వరరావు.

కం. తెలనాటివాడ; కవితకు
తెలనాటితి నవ్య ప్రౌఢ విశ్వధరిత్రిన్
కలరే నీ కెనయగు వా
రలు రసవత్కృతుల సల్పి రసికులఁ దనుపన్.

మైలవరపు కృష్ణమూర్తి.

# చిత్రపటముల వివరణము

రా॥ బ॥ ఎం. పాపారావు నాయుడుగారు :— వీరు పోలీసుశాఖలో నసిస్టంటు సూపరింటెండెంటుగ నుండి యుప కారవేతనమును పొందుచున్నారు. అపరాధపరిశోధనమందు వీరు పేరుపడసినవారు.

కీ॥ శే॥ పెద్దాడ సాంబశివరావుగారు: — ఏలూరులో న్యాయవాదిగ నుండి జాతీయాభ్యుదయమునకై పనిచేయు చుండి పక్షవాతము తగిలి తటాలున స్వర్గస్థులైరి.

కా. వేంకటాచలపతయ్యగారు:—కవులవరం వాస్తవ్యులు. కృష్ణాజిల్లా రయితులసంఘ కార్యదర్శి. జాతీయవాది. 23 వ కృష్ణామండలసభాధ్యక్షులు.

కీ॥ శే॥ ప్రొఫెసరు రామానుజం గారు:— మదరాసు విశ్వవిద్యాలయమునందు ఇంటరుమీడియేటు పరీక్షయం దప జయమొంది యింగ్లాండులో గణితశాస్త్రమునందు అప్రతిహత మగు ప్రజ్ఞను కనుబఱచినవారు.

డాక్టరు ఎం. ఏ. అన్సారి:— డిల్లీవాస్తవ్యులు. దేశీయ మహాసభకును కిలాఫతుసంఘమునకును కార్యదర్శులు.

గా॥ న్యాయమూర్తి వేపా రామేశంపంతులు గారు :— ఆంధ్రులలో ప్రథమమున న్యాయమూర్తిపదవి వడసిన వారు. గణితశాస్త్రమునందు మంచిపాండిత్యము గలవారు.

టి॥ రాఘవయ్యగారు:—ఆంధ్రులు. ఆంధ్రజిల్లాలందు కలెక్టరు పనిచేయుచుండి ప్రస్తుతము తిరువాన్కూరు సంస్థానమునకు దివానుగ నున్నారు.

సి. ఎల్. రెను గారు:—1920 - 21-వ సంవత్సరమున పచ్చయప్పకళాశాలకు ప్రిన్సిపాలుగ నుండిరి. వ్యాకరణ తర్కశాస్త్ర వాది. ఆంగ్లభాషాపాండిత్యము గలవారు.

కీ॥ శే॥ పండిత డి. గోపాలాచార్యులవారు:— ఆయుర్వేద మార్తాండ భిషఙ్మణులు. ఆంధ్రులు.

కీ॥ శే॥ తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు: వీరు అనేక ఆంధ్రగ్రంథములను విమర్శించియుండిరి. ఆంధ్రనిఘంటు కార్యాలయమున పని చేయుచుండిరి.

మిస్. డిలాహే:— చెన్నపురిలోని మేరీ రాణీకళాశాలకు ప్రిన్సిపాలుగానుండి ప్రస్తుతము సెలవుమీద ఇంగ్లాండులో నున్నారు.

శ్రీమతి శ్రీనివాసమ్మ బి.ఏ ఎల్.టి. :— భారత విద్యాశాఖలో నటీనల చేర్చుకొనబడిరి.

అనంతగిరి పేరనార్యకవిగారు:— వీరు అనంతపురము జిల్లాకు చేరిన నరసపురము వాస్తవ్యులు. ప్రస్తుత మనంతపురమునుండి ప్రకటింపబడుచున్న బాలభారతీపత్రికాధిపతులు. బాలభారతీగ్రంథమాలను పైతవెంకటదానిని కొంతకాలము సాగించిరి. బాలభారతీముద్రాలయమునుస్థాపించిరి. ప్రస్తుత అనంతపురమండల జాతీయసంఘమున కధ్యక్షులుగ నున్నారు. అనేక ధర్మకార్యములకు చేయూత నొసగుచుండురు.

రావుసాహేబు మిడతల హంపయ్య గారు:— వీరు దత్తమండల ధనికులలో నొకరు. రావు సాహేబు బిరుదమును ప్రభుత్వమువారిని మెప్పించి సంపాదించినవారు. గుంతకల్లులో నెలకొల్పబడిన యోగ్యధాలయనిర్మాణమునకు సుమారు పదివేల రూప్యములను, అనంతపుర దత్తమండల కళాశాలకు బ్రాహ్మణేతరవిద్యార్థివేతనములకు గాను పదివేలరూప్యముల నొసంగి సేవ యొనర్చిరి. గుంతకల్లు మద్దికెర మొదలగు గ్రామములనుండు జిన్నులు వ్యాపారవు విరివిని ప్రకటించుచున్నవి. తాలూకా జిల్లా బోర్డులందు సభ్యులు.

బాలకవిశిఖామణి, శతావధాని, దోమా వేంకటస్వామిగుప్తగారు, కర్నూలు:— ప్రకృతము కంది పచ్చయప్ప హైస్కూలులో ఆంధ్రపండితులుగా నున్నారు. ఆర్యవైశ్యులు. వయస్సిరువదిరెండేండ్లు. వీ రాంధ్రదేశమున చెన్నకోట్ల శతావధానములను జరపి సన్మానము లందుటయేగాక సుభాగ్యశతకము దీనకల్పద్రుమము, వీరరాఘవశతకము, మహాత్మ గాంధిశతకము, తిలకశతకము, మాణిక్యప్రభుశతకము, సన్మార్గము, మాయాపల్లిక, గణికాపరాజయము, పరకాలవిలాసము మున్నగు పద్యకావ్యములను, చంద్రిక, నిరంజన, మొదలయిన నవలలను, చంద్రకళాసుదర్శనము మొదలయిన నాటకములను రచించిరి. కవిత్వము సొంపైనది.

పండిత సి. టి. అప్పగపిళ్ల గారు:— వీరు సుప్రసిద్ధ ఆయుర్వేద పండితులైన సి. టి. సుబ్రహ్మణ్యపండితులవారి పుత్రుడు. ఇంగ్లీషు యూనాని ఆయుర్వేద వైద్యులచే ఉపయోగములేదని చేయి విడిచిన వ్యాధులను నమ్మకముగా బాగుచేయుదురు. వీరిచే తయారు చేయబడుచున్న దివ్యౌషధములలో 'స్వర్ణరత్నాకర' మనునది ముఖ్యౌషధమై వాసిగాంచి యున్నది. సాదాపుగా సన్నివ్యాధులను ఈ యౌషధముచేతనే నివారణ కాగలవు క్షయము, కష్టము, మూలము, పిత్తపాండు మొదలగు కఠినవ్యాధులను అతిసులభముగా వీరు కుదర్పగలరు. శస్త్రములేకనే సకలవిధ నేత్రవ్యాధులను బాగు చేయుదురు. వీరు పదేపదే ఆయుర్వేదము, నేత్రచికిత్స మొదలగు వాటినిగురించి ఉపన్యాసములు మిక్కిలి వివరముగను ఆకర్షకముగను నిచ్చుచుందురు. అనేక పండిబీదలకు ఉచితముగా ఔషధము నిచ్చుచున్నారు. మిక్కిలి దయ, శాంతము, బీదలయందు ఆదరణ గలవారు. సర్కారువారిచే ఏర్పరచబడిన వైద్యసంఘమునందు వీరొక సభ్యులు.

# శ్రీశైలక్షేత్రము

శ్రీశైలము సుప్రసిద్ధమైన మహాస్థలము. పూర్వమీ మహాస్థలము మహావైభవము ననుభవించిన విధమును పాడుపడిన దేవాలయములు మఠములు కోనేరులు బావులు తెలుపుచున్నవి. ఈక్షేత్రము నుద్ధరించుటకు విశేషమైన ద్రవ్యము కావలసియున్నను భక్తులు వారిశ క్తికి దగినరీతిని ద్రవ్యమును వ్యయముచేసి దేవాలయములను బావులను కోనేరులను బాగుచేయుటకు వీలుగలదు. యాత్రికులు శివరాత్రికి వేలకొలఁది శ్రీశైలమునకు బోయి త్రాగుటకు నీరును నివసించుటకు వసతియును లేకను మహాకష్టములు పడుచుందురు. దేవాలయమునకు సమీపముననను పాడుపడిన బావు లనేకములు గలవు. వానిని బాగుచేయించిన యాత్రికులకు నీటియిబ్బంది పోవును. కీర్తిశేషులైన మాచర్ల రామన్న శ్రేష్ఠిగారు బావిని తీయించుటకు రూ 1000 ఇచ్చియుండిరి.

మ॥ రా॥ శ్రీ, దారా సూర్యప్రకాశలింగముగారు విజయనగరము, సిద్దాబత్తుల పరనమ్మ గారు సికిందరాబాదు, కోటయందు గదులను గట్టించిరి. దేవాలయములను బాగుచేయుటకు మ॥ రా॥ శ్రీ, బెద్దె రామన్నగారు దివాన్ బహదుర రామగోపాలుగారు ముత్యంపాటి గంగాధరయ్య అయ్యవార్లుగారు మొదలగువారు ధర్మముల నిచ్చియుండిరి. తాడేపల్లి మంగయ్యగారు పాత్రసామానుల నిచ్చియుండిరి. పుణ్యాత్ములు వీరివలెనే నూతులకు దేవాలయములకు వసతులకు ధర్మములను జేసినవారి పేరులు శాశ్వతముగ వారి ధర్మకార్యముల స్థానమునందు శిలాశాసనము చెక్కఁబడును.

శ్రీశైలమునందు ముఖ్యముగ చెంచుగూడెము త్రోవలో శ్రీ వీరభద్రస్వామి యాలయము బాగుచేయించుటకు రూ 100 లును భద్రకాళి శిలావిగ్రహమునకు రూ 200 లును వెంటనే కావలసి యున్నవి. పుణ్యాత్ము లీ సత్కార్యములకు ధర్మములను జేసి శ్రీ యంబా మల్లేశ్వరుల కృపకు పాత్రులగుదురుగాక!

# శ్రీశైలయాత్ర

శ్రీశైలమును జేరుటకు నాలుగుదిశలందును ముప్పదిమైళ్లదూరము కొండలమీదను నడవియందును నడిచిపోవలయును. మార్గమునందు నీటివసతి స్థలవసతి లేకను యాత్రికులు కష్టపడుచుందురు. పడమటి ద్వారమునను వచ్చెడివారు నాగలూటిమీఁదుగఁ బోదురు. నాగలూటియందు నిరంతరము ప్రవహించెడి మంచి నీటిధారగలదు. ఆనీటిధారను కోనేరులందు బ్రవహింపజేసి రాతిమెట్లతో కోనేరులనుగట్టిన మహానందియందు వలె నిరంతరము స్వచ్ఛమైన నీరు ప్రవహించుచు యాత్రికులకు సౌఖ్యదాయకముగ నుండును. ఇచటను కోనేటిని సత్రమును గట్టుటకు కర్నూలుకలెక్టరువారు యకరముస్థలము నిచ్చియున్నారు.

ఈస్థలమునందు సత్రమును గట్టుటకు గదికి రూ. 200 చొప్పునఁ గావలయును. ప్రాతకోనేరును బాగు చేయుటకు రూ 500 లును మహానంది కోనేరువంటి కోనేరునకు రూ 2000 లును చిన్నికోనేరునకురూ 300 లు వంతునను గావలయును.

నాగలూటియందు వీరభద్రాలయమును భద్రకాళి యాలయమును బాగుచేయుటకు చెరి రూ 100 లును శ్రీవల్లభా గణపతి యాలయము మరమ్మతునకు రూ 100 లును గావలయును. ఈయాలయముల ప్రతిష్ఠలకును నుత్సవములకును ద్రవ్యముగావలసియున్నది.

ఈ మార్గమునందువలెనే శిఖరేశ్వరమార్గమునందును వసతులు బాగుపడవలసియున్నవి. అక్కడను కలెక్టరుగారు యకరముభూమి నిచ్చియున్నారు. శివభక్తులు పుణ్యాత్ములు ఒక్కొక పుణ్యకార్యమునకు చాలినంత ద్రవ్యమును బంపిన వారిపేర నాప్రతిష్ఠ జరుపఁబడి వారిపేరు శిలాశాసనరూపమునను ప్రతిష్ఠాపనచేసిన స్థలములందు చెక్కించఁబడును.

చందాలను ధర్మములను బంపుటకు చిరునామా:—

**చాగంటి వీరమల్లికార్జునలింగం అయ్యవారు,**

శ్రీశైలము, ఆత్మకూరుపోస్టు, కర్నూలుజిల్లా.

Andhra Students of Calicut Commercial Institute.



ఆంధ్ర వాణిజ్య విద్యార్థులు, కల్లికోట

New Guindy Engineering College, Guindy



మద్రాసు ఇంజినీరింగు కాలేజి, గిండి

Prof. M. V. Krishna Rao



ప్రొఫెసరు ఎం. వి. కృష్ణారావుగారు

Prof. Lakhmaji Rao



ప్రొఫెసరు లక్ష్మాజీరావుగారు

Sree Chintamani Andhra VidyardhiSamaj : DattatreyaMutt Benares City



శ్రీ చింతామణి ఆంధ్రవిద్యార్థి సమాజము : దత్తాత్రేయమఠము శ్రీకాశి

A Boy at Kasur aged 11 years.
Charged with Waging War Against the King



11 సంవత్సరముల బాలుని రాజద్రోహి యని పట్టుకొనుట

## మీరు ఒక జమీందార్లు, భూస్వామి, ఒక వకీలు, ఒక డాక్టరు లేక ఒక వర్తకుడు, వీరిలో ఎవరుగా నుండినను అడిసన్ వారి వద్దనుండి ఒక కారును తెప్పించుకొనిన మిక్కిలి సహాయకారిగా నుండును.

**జమీందారులు:**—వారి సంస్థానమునందు చాల దూరమునందుండు చోట్లకు పోవచ్చును, స్వయముగా విచారించుకొనవచ్చును, వారి రైతులయొక్క మనస్సునందుండు గౌరవమును అధికముగు నట్లు చేయవచ్చును. పరిశుభ్రమైన గాలి, ప్రదేశము మార్పు, మంచి ఆరోగ్యమునకు ఆవశ్యకమైనవి.

**వకీళ్లు:**—తమ వృత్తియందు మిక్కిలి అభివృద్ధి చెందినట్లు గ్రహించుచున్నారు. కక్షిదార్ల కాలమును వ్యర్థము చేయనట్టివారికిగాను వెదకుచుండుడు, ఒక మంచి మోటారుబండి చక్కగా కాలమునుకూడ బెట్టును. మోటారులో కూర్చునిపోవుటకంటె మించిన వేడుక మరియొకటిలేదు.

**డాక్టర్లు:**—ఎవరును ఒక నమ్మకమైన మోటారుబండిని లేక ఉండరాదు. తొందరమైన కేసులు, ప్రాణము లేక మరణము - తొందరగా రావలసినట్లు కోరువారు, ఇట్టి విషయములలో ఒక కారు అతివేగముగా ఆచోటికి చేర్చును.

**వర్తకులు:**—కొన్ని సమయములందు ఒక బేరము లేక వ్యాపారము నిమిత్తము కొన్ని మైళ్లదూరమునకు పోవలసియుండును. కొన్ని గంటలసావకాశముచే నూర్లకొలది రూపాయలు నష్టపడవలసియుండును. అందువలననే కారొకటి యుండుట ఆవశ్యకము - ఇదిగాక మీ కుటుంబమునందుండు వారుగాని, మీరుగాని కొన్ని గంటలకాలము గృహమునందు పని చేసిన తరువాత మీ కందరికిని పరిశుద్ధమైన వాయువు ఆవశ్యకము.



అడిసన్ వారి బండ్లు పెట్టుబడులేను. మీ వ్యాపారమునందు వృద్ధియగుటకు కారణమగును. అయితే ఇవి, మోటారులు ప్రథమమునుండి చేయబడి, వాటియందు మంచి అనుభవముగలిగినట్టి నిపుణులచే ఏర్పరచబడినవి.

## అడిసన్ అండు కో. లిమిటెడ్,

ENGLISH MADE

# Guard or Engine-room CLOCKS

## Anti-Magnetic Lever Movement.

Solid Brass flanged cases, solid cast bezel with bevelled plate glass. 8-day lever movement with jewelled anti-magnetic escapement. Lock up case.

These clocks will last a life-time, being a strong and well made English article. The anti-magnetic escapement is a special feature. Whilst the lock up case means safety from interference.

Special adjustment in hanging is unnecessary as they will go in any position. We thoroughly recommend these clocks in all respects.

| | | | | |
|---|---|---|---|---|
| 6 inch dial | ... | ... | ... | Rs. 60 |
| 9 " " | ... | ... | ... | " 120 |



## రెండునందల ప్రతులు మాత్రమే

నిలువ యున్నవి.

## ఈ విజ్ఞానవల్లి

పదునాలుగు గ్రంథముల ప్రథమసంపుటము

కం॥ "శ్రీకరమై, సురుచిరశో । భాకరమై, సకలసుజన - వందిత గుణర। త్నాకరమై, భవహరమై ప్రాకటవిజ్ఞానవల్లి-పరఁగును పరమై॥ శర్మే అలీపాకవి. "ఈ గ్రంథములు విజ్ఞానమందిరసోపానములే యనఁదగు. మానవుఁడు తన జీవిత పరమావధి సెట్లుగడపు కొనవలసినదియు నిందు విశదీకరింపఁబడియున్నది" మా॥ వేం॥ శర్మ,

"ఈవిజ్ఞానవల్లి జనుల హృదయక్షేత్రముల విజ్ఞానవిత్తనములను వెదఁజల్లునది. భక్తినిఁ బ్రబోధించునది. పూర్వచరిత్రములను జీవితములను జ్ఞప్తికిఁ దెచ్చి నూతనోత్సాహము గలిగించునది. ధర్మ ముపదేశించునది. రసము లాలికించునది ... ... „ అ-వా-భూమణరావు.

ఇఁకను పనేకులు కొనియాడియున్నారు. ఈ సంపుటము వెల రూ. 3-8-0. గ్రంథాలయములకు మాత్రము రు 2-8-0.

విజ్ఞానవల్లిక, ధర్మవరము, అనంతపురము జిల్లా

## ధర్మవరచరిత్రము.

శ్రీపీఠికాపురవాస్తవ్యులును, కారికావ్యయంవర విచిత్రబిల్హణీయాది నాటకగ్రంథకర్తలును నగు, ఉమర్ అలీషాకవి గారు దీని విషయమై యిట్లు వ్రాయుచున్నారు:—

ఉ॥ "శీరిపి వంశ మండనుఁడ । శేషకలాకలితుండు శేకసే
వారతుఁ డాంజనేయుఁడను । పండితముఖ్యుఁడు జ్ఞానవల్లిమం
దారుఁడు కోవిదుండు తన । ధర్మవరంపుచరిత్ర వ్రాసె శృం
గార రస ప్రబంధముల । కన్న నిదే సొగసై వెలార్పఁగన్॥
ఉ॥ పండిత పామరుల్ సతులు । బాలకు లన్నియెడల్ పఠింపగా
నుండెడు సొంపు నింపుకథ । లున్నవి, విద్యయు నీతి రీతియుం
దుండిన వారె పూజ్యులని । యున్నది, ధర్మముకన్న మంచిదే
దుండినలాభముండదని । యున్నది, ధర్మవరంబు గాథలో॥"

ఇది పది ప్రకరణముల వచన గ్రంథము. రమారమి రొమినిమిది వందల యేండ్ల చరిత్ర యిందు వర్ణింపఁబడినది. ప్రాచీననిర్మాణములయు - ప్రసిద్ధపురుషులయు - సమాజములయు - చిత్రపటములు పదమూఁడు చేర్పఁబడి మనోహరముగ ముద్రింపఁబడినది. గ్రామచరిత్రకారుల కిది మచ్చు. గ్రంథాలయముల కాభరణము. ప్రతి గృహమున నుండఁ దగినది. వెల 8 అణాలు.

శీరిపి ఆంజనేయులు, ధర్మవరము, అనంతపురముజిల్లా.

## రామామృతము

రామామృతము:—సకలవ్యాధులకు ఆశ్చర్యముగా నిమిషములమీద పనిచేయును. ప్రతిగృహమున సిద్ధముగా నుండి పలురోగముల కుపయోగించిన, వాట్లనుపారదోలి కంటికిరెప్పవలె కాచును. సీసా 0-12-0.

సుఖవిరేచనమాత్రలు:—వమనము గాని, వికారముగాని ఎంతమాత్రము కలుగ జేయవు. రాత్రి పరుండబోవునప్పుడొకమాత్ర వేసికొని పరుండిన ఉదయమునసే 2 గాని 3 గాని సుఖవిరేచనము లగును. సీసా. 0-6-0.

మకరధ్వజము:—సకలదీర్ఘవ్యాధులను పారదోలి దేహమును వజ్రమువలె చేయును. దీనికి సమమగు రాజౌషధము లేదు. తులం వెల 25-0-0.

ఇందు వివరించి వ్రాయుట క్లుప్తముగా వ్రాసినాము. పోస్టు ఖర్చులు వేరు. మేము అనేకవిధ ప్రశస్తమైన ఔషధములు తేహములు సరసముగా సప్లయిచేయుదుము. కేటాగు ఉచితము.

**యి. యం. శర్మ అండ్ కంపెనీ,**

టానేలంక, గోదావరిజిల్లా.

శ్రీ

## చరకసంహితా॥
### ఆంధ్రతాత్పర్యవ్యాఖ్యానసహితము
### సూత్రస్థానము

ఇది

కార్వేటినగరము-రాజవైద్య- కే.ఎస్.శాస్త్రిగారివలన ప్రచురింపబడిన యాయుర్వేదగ్రంథావళియొక్క- ప్రథమగుచ్ఛము. ఆయుర్వేదప్రచారకు లగు నాంధ్రవైద్యపండితజనాదరణీయమై యొప్పారునట్టి యమూల్యగ్రంథరాజము. 25 మాసములు కలుగా ముద్రింపబడిన విడిప్రతివెల రు 12-8-0, కలికో గిల్టు బైండు ప్రతి రు 14-0-0. తపాలుచార్జిప్రత్యేకము. కొద్దిప్రతులే నిలువగాన త్వరలో దరఖాస్తుచేయవలెను. "యోహిసమ్యజ్ఞానాతి శాస్త్రం శాస్త్రార్థమేవచ। నకుర్యాత్సక్రియాం చిత్రమచతురిక చిత్రకృత్॥"

కే. ఎస్. శాస్త్రి.

శ్రద్ధగా గమనింపుడు. **శతమూలికాదిలేహ్యం** మేలుకొనుడు.

తు 20. రు 5-8-0. **తు40. రు10.** తు 10. రు 3-0-0.

నిర్వికల్పసమాధినిష్ఠాగరిష్ఠు లగు మాగురువుగారిచే కనిపెట్టబడి చిరకాలమునుండి యనుభవనీయమై సుఖరోగుల పాలిటి సంజీవి యని విఖ్యాతి గాంచినది. మిక్కిలి సారవంతములగు 100 మూలికలచేతను, శతపుత, కృష్ణాభ్రకము మున్నగు రప్రశస్తభస్మములచేతను తయారుచేయబడినది. కొరుకు, మూల, బగ్గి, పొడలు, మచ్చలు, దద్రు, చిడుప, దురద, చిట్లు, పొక్కు మొదలగు అన్నివిధముల సవాయిలను రూపుమాపుటలో నింత మహత్తరముగా పనిచేయు నౌషధ మింకొక్కడను లేదనుట నిర్వివాదాంశము. 18 మూత్రకృచ్ఛ్రములను 20 మేహములను, 24 పైత్యములను, శుక్లనష్టము, నిస్సత్తువ, అరుచిని, అజీర్ణమును మలబద్ధమును బోగడచి, రక్తమును శుభ్రపరచి వీర్యవృద్ధి కలుగజేయును. స్త్రీల కుసుమరోగ సంబంధమగు నన్నిబాధలను నివర్తించి గర్భధారణానుకూలల గావించును. ఈ 40 తులముల లేహ్యమందు రు 7-8-0 లు కిమ్మత్తుగల తులంన్నర లోహాభ్రకసింధూరము కలిపి సేవించినయెడల సర్వమేహాది రోగములను బోగడ చుటయేగాక మధ్యకాలములో కలిగిన నపుంసకత్వమును తొలగజేయును.

### యోగ్యతాపత్రిక

అయ్యా! నిండాజబ్బుస్థితిలో నుండుటవల్ల 1911 సం॥ మున నేను మీ నారసింహలేహ్యమును మండలము దినములు సేవించగా నది నాజీర్ణశక్తిని హెచ్చించి బలమును కలుగజేసినది. దీర్ఘ శిరోవేదనమునకు నాసహోదరికి మీ భృంగామలకతైలమును వాడుటవల్ల వ్యాధి పూర్ణముగా కుదిరినది. క్రిందటి సంవత్సరమున బహుశీతల వాయుసంపర్కమువలన నాకుగలిగిన నొప్పికి మీరు దయతో నిరూపించి పంపినశతమూలికాదిలేహ్యమువల్ల నా పూర్వపు యారోగ్యమును, బలమును కలిగినవి. దేశోపకారార్థము మీరు పడుచున్న శ్రమకు నే నెంతయు మెచ్చుకొంటిని.

యం. నరశింహాచార్యులుగారు డిప్యూటీకలెక్టరు హాఫీలుదారు, తుని.

మహాఖండార్ద్రికలేహ్యము తు 40 లు రు 4 లు. తు 20 లు రు 2-8-0. తు 10 లు 1-8-0. ఇది ఆమము, ఉబ్బసము, దగ్గు, కామిల, జ్వరము, పాండువు, శూల, పీనస, సర్వపైత్యములు, అరుచి, ప్రారంభగుల్మము, మలబద్ధము, మేహపైత్య కారకములు, నశింపజేసి, అన్నకోశము ప్రబలింపజేసి అగ్నిదీప్తి, అన్నమునందిచ్ఛ, బలము, మనస్సంతోషము కలిగించును.

### ప్రమేహాంతక మాత్రలు 20 రు 1-0-0

ఇది తెలుపు, ఎరుపు, మొదలగు శుక్లరోగములను (అంటురోగములను) అతిశీఘ్రముగా మాన్పును.

యింకను మావద్దను ప్రశస్తముగా తయారు కాబడిన, పూర్ణచంద్రోదయము, వసంతకుసుమాకరము మొదలగు 138 రకముల ఔషధములు సదా విక్రయములకు సిద్ధముగా నున్నవి. కేట్లాగు కోరువారికి ఉచితముగా పంపబడును.

### పూర్ణచంద్రోదయం మాత్రలు 100 కి రు 12-8-0

ఇది పాడిదగ్గు శరీరమంటలు, మన్యజ్వరములు మొదలగు ననేక రోగములను నశింపజేసి సంతోషము పుష్టి వీర్యవృద్ధి కలిగించును.

### ఋతుశూల గజకేసరి తులం 1 కి రు 2-0-0

బహిష్ఠయిన స్త్రీలు ముట్టు కట్టు నొప్పితో పడుబాధను చెప్పనలవి గాదు. అట్టివ్యాధికి దీనిని సేవించిన సర్వఋతుశూలలు సహింపజాలని కడుపు నొప్పియును ఆశ్చర్యముగా కట్టును.

### కుసుమరోగాదిమాత్రలు 29 కి రు 1-8-0

ఇది, తెల్లగా, యెఱ్ఱగా, పచ్చగా, స్రవించువ్యాధిని సహింపజాలని బాధ, పోటు, ఒడలు, ప్రక్కనొప్పి, సలుపు, తేనుపులు, అన్నము లుగకుండుట, కడుపునొప్పి వచ్చుట, తలనొప్పి మలబద్ధము నివర్తించి సంతానవంతులుగా జేయును.

### భృంగామలకతైలము 1 సీ రు 1-0-0. డ. రు 10-0-0.

దీనిని తలకు రాయుచువచ్చిన తలనొప్పి, తలవణకుట, కణతలు నొప్పి, దంతరోగములు, కర్ణరోగములు, నేత్రరోగములు, మేహసంబంధమగు శిరోరోగములు నివర్తించి, మెదడుకు చల్లదనము కలిగించి మంచిజ్ఞాపకశక్తిని బుద్ధిబలమును నిచ్చును.

### స్తంభనాది గుటికలు 20 రు 1-0-0 100మాత్రలు 4-0-0.

ఇవి దేహదార్ఢ్యమును, వీర్యస్తంభనమును, సురతానందమును, వృద్ధులకు సహా వీర్యవృద్ధిని కలిగించును.

పొన్నాడ వేరయ్యా అండు సన్సు,

ప్రొప్రయిటర్సు, శ్రీ భుజంగరాజ వైద్యశాల

తాళ్లరేవు (గోదావరి జిల్లా)

జన్మము ఉండునంత దనుక

## రోమములు మొలవదు

మా రోమరక్షణిని రప్పించి ఉపయోగింపుడు. 1 బుడ్డి వెల రు 1-0-0 మాత్రమే. ఒకసారి రెండుబుడ్లు తెప్పించు కొనువారికి తపాలుఖర్చు ఇనాం.

ఉత్తరములు ఇంగ్లీషు భాషలో వ్రాయవలెను.

**M. D. SHUKUL,**
**No. 2 KANKHAL, U. P.**

## అత్యద్భుతమైన కనిపెట్టడము.

అపరేషను అనావశ్యము, ఒరిబీజము, ఏనుగకాలు గడ్డలు మొదలగు వ్యాధులపైన దద్దిన అమోఘముగా కుదురును. అపాయకరమైన ఓషధులు చేరుటలేదు. వైద్యపండితులచే శిఫార్సు చేయబడినది. ఒక అవ్వున్స వెల రు 2-4-0. పౌను వెల రు 25. ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను.

S.P.Pharmaceutical Works, (I) P. O. Deoghur E.I.R. India

## LIVING ADS

Are infinitely better than Assertions, *Actina* possesses legions. There is no big town in the whole of India wherein it hasn't got a number of Votaries. Big renowned gentlemen are its devotees. Read the following:—

*K. L. Sundaram Iyer Esq., Pleader, Pollachy District Board Member, and Municipal Councillor Udamolp et Coimbatore*, writes "I am purchaser of your Actina. I have found it most efficacious, for restoring the lost vision in the eye. With a view to popularise your Actina I have recommended it to others. I write this with the greatest pleasure that you may make use of this for the confidence of your future applicants. I am aged 52 and in April 19, I lost vision in both my eyes by granular growth and its attendant effects. Prompted by faith I got your Actina and...... I am completely relieved of my eye complaints and not only that, no spectacle is used by me now, although I have been using spectacles for a long time. I do not consider the price of Actina is a sufficient recognition of its merits in proportion to the inestimable boon guaranteed by its application.........Actina saved my eyes."

And then Judge for yourself. Actina is a miracle for all Eye, Ear, Head and Throat troubles. It is a *Curative*, not a *corrective*. It dispenses with doctoring and drugging. It succeeds where specialists fail and the price is only Rs. 25-8, packing and postage charges extra.

Write, if interested, to *Actina Dealer in the East* (A. P.) *Batala* (India), for its

**Free Booklet.** (C)

# Novelties of the Himalayas.

**We deal in Ayurvedic and Unani precious natural drugs of excellent quality.**

WE SOLICIT TRIAL OF THE SAME.

### Musk or Kasturi.

Tibetian Musk Rs 31 per tola.
Assam Musk Rs. 26 ,,
Nepal Musk Rs. 23 ,,
Kashmir Musk Rs. 20 ,,
Ambar Gris Rs. 42 to Rs. 50 per tola.
Gorochanam Rs. 5/8
Kashmir Saffron Rs. 1, 1/4 & 2/8 ,,
Shalajit or Momayi Re. 1 & As. 12 ,,
Civat or Zundbadastar Rs. 5. Crude Rs. 3/8.
Saliv Misri As. 4 per tola.
Pachakarpooram Rs. 2 to Rs. 3/8 ,,
Bhim Sain Camphor Rs. 5/0 ,,
Pearls Rs. 24 ,,
Surma containing Momira, Pearls, Bhim Sain: Best remedy for eye diseases Black Rs. 2. White Rs. 2/8 per tola.
Kabul Assafoetida or Hingu No. 1. per tin (12 tolas) Rs. 1, 6 tins Rs. 5 per lb Rs. 2/3.
No. 2, per tin (12 tolas) As. 11, 6 tins Rs. 3/12.
Kabul Assafoetida special quality refined, per tin (12 tolas) Rs. 2, per lb Rs. 5.

Malaria Pills—possess both curative and preventive properties price 100 pills Re. 1.

Gold Snuff—good for bad cold and headache per tin (12 tolas) Re. 1.

Hair Removing Powder—As. 4 per packet.

### Sondhi's Amrita Ras

is the true Elixir of Life. It is a panacea for all the ills effecting human body. A wonderful efficacious sovereign remedy all internal or external diseases. It cures Cholera, Plague, Influenza, Typhoid fevers, Cardialgia, Headache, Cough, Cold, Vomitting Diarrhoea, Dysentry, Toothache, Scorpian bites, cuts, buns, etc. Directions with phial.

*N. B.*—It is by far the cheapest and most excellent of all medicines of this nature.

Per phial Rs. 2/8 (240 doses).
Half phial Rs. 1/8 (120 doses).

### Kasturi Pills.

Refreshing Aromatic, Wonderful Tonic, good for Cough, Cold, Headache, Throat, Sexual Debility, etc. Price per phial Re. 1.

**Money back if the Drugs do not give satisfaction. Catalogue Free.**

**B. R. SONDHI & CO., Phagwara, (Punjab).**

# లిటిల్స్ ఓరియెంటల్ బాం అండ్ ఫార్మస్యూటికల్స్ లిమిటెడ్

15, అరమనకార వీధి, మదరాసు.



## లిటిల్స్ ఓరియంటల్ బామ్.

కుంటితనమునుండి పీడించ బడుచుటువంటి ఏ నొప్పియు లేనివానిగా నిది మార్చును.

కోల్డ్‌ఫీల్డ్, సట్టన్ పట్టణములో నున్న కె. హన్యాక్ దొరగారు వ్రాయున దేమనగా:—"లిటిల్స్ ఓరియంటల్ బామ్" (Little's-Oriental Balm) అనునది నా కాళ్లకు, మోకాళ్లకు రుద్దగా 10 నిమిషముల లోపల నా నొప్పి పోయెను. 1 సంవత్సరము వరకు కుంటుటకు వల్ల కాకుండిన కాలుగల యొక స్త్రీ అత్యధికమైన బాధతో నుండుట నేను కనుగొనగానే "లిటిల్స్ ఓరియంటల్ బామ్" (Little's Oriental Balm)ను వాడు మని ఒక్క సీసా మాత్రమే ఆమెకు యివ్వగా ఎప్పటివలె బాగాయెను.

సీసా 1-కి 1-0-0 రూపాయ చొప్పున ఏ మందు షాపులో నైనను దొరకును.




## లెక్కలేని రోగులు కుదుర్చబడిరి.

కుంటివారు వాతరోగముచేత పీడితులై మంచము పట్టియున్న వారు కుదుర్చబడి నడక గలిగిన వారైరి. వైద్యులవల్లను ఆస్పత్రుల నుండియు బాగుచేయబడలేక విడిపించబడిన రోగులు "లిటిల్స్ ఓరియంటల్ బాము" ద్వారా కుదర్చబడిరి. బర్మింగ్‌హాము నందు న్యూహాల్ స్ట్రీట్‌లోనున్న సాయర్ దొరగారు చెప్పునది యేమనగా "సుమారుమూడు సంవత్సరముల క్రిందట నాపనికి వెళ్ల లేనట్లు చేసిన "వాతరోగము" (Rheumatism) నా యందు మోకాలుకు కలిగెను. ఒక స్నేహితుడు "లిటిల్స్ ఓరియంటల్ బామ్" (Little's Oriental Balm) ను వాడుక చేసి చూడుమని సలహా యిచ్చి ఒక సీసా కొనుక్కొని నన్ను బలవంతపెట్టెను. నేను పరీక్షించి చూడగా మూడుదినముల లోగా నేను సంపూర్ణముగా బాధనుండి తప్పించబడుటవల్ల నాకు కలిగిన ఆశ్చర్య కృతజ్ఞతలు యెంతగొప్పవై యుండునో మీరే ఆలోచించి చూడండి.

ఒక సీసా 1 రూపాయి వంతున యేమందు షాపులో నైనను దొరకును.



## నడుము నొప్పి.

రాత్రియంతయు నీ పడకమీద బాధపడుచు, మేలుకొనుండ చేయు నడుము నొప్పి నీకు వున్నదా? నడుమునొప్పి చాలా కష్టమైనది గనుక నీవు "దానిని హాస్యరసముగా చూచి వూరికే యుండకూడదు." లిటిల్స్ ఓరియంటల్ బామ్‌ను రుద్దుటవల్ల దానిని ఆపును. విస్‌యుద్, మాయిడోరిలోనున్న సి. సర్క్యులర్ దొరగారు వ్రాయున దేమనగా:—

"నేను 8 మాసములు కఠినమైన "నడుము నొప్పి" (Back-ache) వల్ల బాధపడుటచే పనికిపోవుటకు వీలులేక అప్పుడప్పుడు మంచము పట్టియుండగా "లిటిల్స్ ఓరియంటల్ బామ్" (Little's Oriental Balm) ను పయోగించిన తరువాత నాకు కలిగిన ఫలితమునకు మిక్కిలి ఆశ్చర్యపడితిని.

సీసా 1-కి 1 రూపాయ చొప్పున ఏ మందు షాపులో నైనను దొరకును.

# Little's Oriental Balm & Pharmaceuticals Ltd,

15, ARMENIAN STREET, MADRAS.